JAGATI Rs. 2-00 July 1989

34th Year of Publication




జులై – 1989

## సాహితీ సుధ

ఎడ నిమిషంబు లేక ధరణీశశతంబు భుజించుచున్న యి
ప్పుడమి లభించినన్ మహిమ పొందును రాజులనేల తున్కలో
నడరు లవంబులో దునియ యందొక మూలకు నాథులైన వా
రడలక వైపరీత్యమున హర్షము జెందుదు రెంత మందులో

—భర్తృహరి.

తీర్థ సువాసు లేతెంచినారని విన్న, నెదురుగా కేగు దవ్వెంతయైన
నేగి తత్పదముల కెఱగి యింటికి దెచ్చు, తెచ్చి సద్భక్తి నాతిథ్యమిచ్చు
నిచ్చి యిష్టాన్న సంతృప్తులుగా జేయు, చేసి కూర్చున్నచో జేరవచ్చు
వచ్చి యిద్ధర వనది పర్వత సరిత్, తీర్థ మాహాత్మ్యముల్ దెలియనడుగు
నడిగి యోజన పరిమాణ మరయు నరసి, పోవలయు
జూడననుచు నూర్పులు నిగుర్చు
ననుదినము దీర్థ సందర్శనాభిలాష మాత్మనుప్పొంగ నత్తరుణాగ్నిహోత్రి

— అల్లసాని పెద్దన 'మనుచరిత్రం'

'జ గ తి' – 2, కచేరి రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు 600004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 45-00 – 5 సం॥లకు రు. 100-00. జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: చార్లీ చాప్లిన్

# నిమ్మతొనలు

బ్లైన్ హిమ్ పాలెస్‌లో 1874లో జన్మించిన విన్‌స్టన్ చర్చిల్, స్కూలులో బాగా రాణించకపోయే సరికి, సైనిక శిక్షణలో చేర్చారు తలిదండ్రులు. క్యూబా వెళ్లి వచ్చాక (న్యూస్ పేపరు కరస్పాండెంట్‌గా), అతనిని ఇండియాలోని బెంగుళూరుకి పోస్ట్ చేశారు. మిత్రులు వినోద విలాసాలతో కాలం వెళ్లబుచ్చుతూండగా, తల్లి తనకోసమని పంపే 'యాన్యుయల్ రిజిస్టర్లు' (పార్లమెంటులోని వాదప్రతివాదాలని లిఖిత రూపాన భద్రపరిచే గ్రంథాలు) యితను ఎంతో శ్రద్ధగా పఠిస్తూ, తన భాషాపటిమను, భావ పుష్టిని వృద్ధి పరుకున్నాడు. 1899లో, అంటే ఇరవై అయిదోఏట, మాంఛెస్టర్‌లోని వోల్డ్‌హామ్ జిల్లా నుంచి పార్లమెంటు అభ్యర్థిగా చేసి, చిత్తుగా దక్షిణాఫ్రికాలో యుద్ధ విలేఖరిగా రాసిన అనుభవాలు, ఇంగ్లండు, అమెరికాలలో అచ్చయిన రొమాంటిక్ నవల, పేరు ప్రతిష్టలు పెంచడంతో విన్‌స్టన్ 1901 లో మళ్లీ పార్లమెంటుకి పోటీ చేశాడు.

ఈసారి పదకొండు నియోజక వర్గాలవారు, 'ఇక్కడ నిలబడండి అంటే ఇక్కడి నిలబడండి' - అతి చర్చిల్‌పై వొత్తిడి తెచ్చారు; బని మాలారు.

"రెండేళ్ల క్రితం నేను ఎక్కడ వోడిపోయానో, అక్కడే నిలబడి నెగ్గాలి" - అన్నాడు. ఆ వోల్డ్‌హామ్ నియోజక వర్గం నుంచే నుంచుని 1901 లో, తన 27 వ ఏట పార్లమెంటులో అడుగుపెట్టి, ఇరవైఏళ్లపాటు అపజయమనేది తెలియకుండా పయనించాడు. ఆ తర్వాత జయాపజయాలు జోడుగుర్రాలు కాగా, పశ్చిమ నాగరికత నిలబెట్టిన వీరాగ్రేసరునిగా చరిత్ర పుటలలో ఘనకీర్తి పొందాడు.

బోయరు యుద్ధకాలంలో చర్చిల్‌ని, ప్రాణాలతోగాని, ప్రాణం లేకుండా గాని, పట్టుకున్న వారికి 'పాతికవేల పౌనులు బహుమతి' అని పోస్టర్లు అతికించారట.

ఆ పోస్టరొకటి భద్రంగా దాచి, "నా విలువ యింతేనా ?" - అన్నాడు విన్‌స్టన్.

బ్రిటిష్ పార్లమెంటులోని మొట్టమొదటి మహిళా సభ్యురాలైన లేడీ యాస్టర్ ఒకసారి విన్‌స్టన్ చర్చిల్‌తో అంది : "నేను గనక మీ భార్యనై

వుంటే, మీరు తీసుకొనే విషం కలిపి వుందును."

"నేను గనక మీ భర్తనైతే, హాయిగా తాగేసి వుందును" అన్నాడు చర్చిల్.

బ్రిటిష్ ప్రధానిగా 1954 లో చర్చిల్, వాషింగ్టన్ వచ్చినప్పుడు, బంగారు పిడిగల చేతిబెత్తం వూతగా విమానం దిగి, తన అస్వస్తత, అనారోగ్యం న్యూస్‌కె మెరాలకు ఏమాత్రం తెలియనీయకుండా, తన విక్టరీ గుర్తుతో నవ్వులు విరజిమ్ముతూ, ఎర్‌పోర్ట్ సందేశంలో, 'ఫాదర్ లాండ్ నుంచి మదర్ లాండ్‌కి రావడం ఎంత ఆనందదాయకమో!' - అన్నాడు. (విన్‌స్టన్ తల్లి లేడీ రండోల్ఫ్ చర్చిల్, అమెరికాలోని బ్రూక్‌లిన్‌లో జన్మించింది)

విన్‌స్టన్ తండ్రి లార్డ్ రండోల్ఫ్ ఐశ్వర్యవంతుడు, గొప్ప రాజకీయవేత్త; బ్రిటిష్ మంత్రి మండలిలోని ముఖ్యులలో ఒకడాయన.

అయితే, ఒకసారి ఏదో విధాన సమస్యపై అభిప్రాయ భేదం వచ్చి, తన అసమ్మతి తెలిపేందుకు రాజీనామా పత్రం పంపించాడు. 'ఎందుకు రాజీనామా చేస్తున్నారు?' అని ప్రధాన మంత్రి తనని పిలిచి అడుగుతాడని ఆయన ఉద్దేశం. అలాటి శషభిషలేమీ లేకుండా పుటుక్కున రాజీనామా ఆమోదించాడు ప్రధానమంత్రి. మళ్లీ రాజకీయ పునః ప్రవేశమంటూ లేకుండా, నిరాశా నిస్పృహాలతో తన 46 వ ఏట దివంగతుడయాడు విన్‌స్టన్ తండ్రి. తండ్రి ప్రభావం వల్లనే 'ఓటమి' అనే మాట తన పదకోశంలో నుంచి కొట్టేశాడు చర్చిల్.

ఒక ప్రఖ్యాత నాటక రచయిత, తన నాటకం ప్రథమ ప్రదర్శనకు రెండు కాంప్లిమెంటరీలు విన్‌స్టన్ చర్చిల్‌కి పంపుతూ చిన్న చీటీ పెట్టాడు - 'ఒకటి మీకు, మరొకటి మీకెవరైనా ఫ్రెండు వుంటే....'' - చర్చిల్ జవాబు రాశాడు: "మొదటి ప్రదర్శనకు, యితర పనుల వల్ల వచ్చే అవకాశం లేదు - రెండో దంటూ వుంటే చూదాం''

—క్షీరసాగరమ్

# పాఠకుల తీర్పు



సంపాదకుల : 'జ గ తి' ప్రతిక అఖిలాంధ్ర పాఠకులకు గాక, ఒక వర్గంవారికి మాత్రమే కేటాయించ బడిందేమో నన్న సందేహము కలుగుతోంది. 'వెన్నెల కెరటాలు' లో వెనకటి ముచ్చట్లు ఎందుకు ? అర్థం గాని 'స్వాతంత్ర్య పత్రం' ఎవరి కోసం ? 'ప్రాచీన సాహితి' లోని పద్యాలు చదవడానికే కఠినంగా వున్నాయి. సామాన్య పాఠకుని కాల క్షేపానికి ఒక చిన్నకథ కూడా లేదు. జనాకర్షణగా వుండాలంటే, గేయాలు, వచన కవితలు ప్రచురించండి.

— కె సీతారామ్
గుంతకల్లు

ఎడిటర్‌గారికి : 'జ గ తి' లో మజిలీ సీరియల్ చదువుతూంటే, తరువాత ఏమవుతుందా అనే ఉత్సు కత కలుగుతోంది - అన్నపూర్ణారెడ్డి గారు చాలా బాగా వ్రాస్తున్నారు. 'నిమ్మతొనలు' నవ్విస్తే, 'డైరీ' ఎన్నో కొత్త విషయాలు తెలుపు తున్నది.

— సి విజయకుమార్
సికింద్రాబాదు-25

చందూర్‌గారికి : నమస్కారములు, తెలుగు పత్రికలలో 'జ గ తి' కి ఒక ప్రత్యేక స్థానం ఉంది. చూడటానికి చిన్నదైనప్పటికీ, ముఖచిత్రం నుంచి, కార్టూన్ నుంచి, ప్రతి పేజీ ఆసక్తి జనకంగా ఉంటుంది. పిక్చర్స్, సమీ క్షించే తీరులోనే ఒక భిన్నత్వం ఉంది. అలాగే, 'డైరీ' సాంస్కృతిక విశేషాల దర్పణం: పత్రిక చిన్న దవడం వల్లనే ఇంత శ్రద్ధకనబరుస్తు న్నారేమో.

— కె నారాయణ
కాకినాడ-3

చందూర్‌గారికి : నమస్సులు. మాన వత్వాన్ని, మానవతా విలువలను మేల్కొల్పేదిగా ఉన్న 'జ గ తి' మా కెంతగానో నచ్చింది. అన్ని అంశాలు సందేశాత్మకంగా, ఆలోచనాకరంగా ఉంటున్నవి.

— వి రమాకిషోర్
హైదరాబాదు — 39

చందూర్‌గారికి : నమస్కారములు. 'జ గ తి' ద్వారా మేము ఎన్నో తెలి యని విషయాలు తెలుసుకుంటు న్నాము. 'పాతికేళ్లనాటి పిక్చర్' లోని అంశం. కనువిప్పుగా ఉంటున్నది. 'నిమ్మతొనలు' నవ్విస్తే, 'డైరీ' శీర్షిక సాంస్కృతిక విశేషాలు తెలుపుతున్నది.

— కెయన్వి రవికుమార్
మెలవరం



పర్వత శిఖరాలు కూనిరాగం తీస్తాయి; పెద్ద పట్నాలు నానా యాతన పెడతాయి. — బెరన్

## మవలంకర్

మనదేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి బలవత్తరమైన పునాదిని నిర్మించిన వారిలో జి. వి. మవలంకర్ అగ్రగణ్యులు. స్వతంత్ర భారతదేశ లోక్‌సభకు మొట్టమొదటి స్పీకర్. ప్రముఖ గాంధేయవాది, స్వాతంత్ర్య సమరయోధుడు. ఇది ఆయన శత జయంతి సంవత్సరం. గణేశ్ వాసుదేవ్ మవలంకర్ 1888 నవంబరు 27వ తేదీన గుజరాతు రాష్ట్రంలోని బరోడాలో జన్మించారు. 1904 లో బొంబాయి విశ్వవిద్యాలయ మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులై 1908 లో పట్టభద్రులై, బొంబాయిలోని గవర్నమెంటు లా స్కూలులో ఎల్. ఎల్. బి. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైనారు. 1913 లో అహమదాబాదు నగరంలో న్యాయవాదిగా ప్రాక్టీసు ఆరంభించి, 1937 లో అహమదాబాదు నగర ప్రతినిధిగా బొంబాయి శాసనసభకు ఎన్నికై, న్యాయవాద వృత్తిని పూర్తిగా వదిలి వేసి, అదే సంవత్సరం జులైలో బొంబాయి శాసనసభ స్పీకర్‌గా ఎన్నుకోబడి, ఆ తర్వాత కేంద్ర శాసనసభ చివరి అధ్యక్షులుగా 66 ఓట్లతో ఎన్నికైనారు. మహాత్మ గాంధీయే స్వయంగా మవలంకర్‌ను కస్తూర్బగాంధీ జాతీయస్మారక నిధికి ఎగ్జిక్యూటివ్ మెంబరుగా నియమించారు. ఆ తర్వాత ఆ నిధికి ఉపాధ్యక్షులై అధ్యక్షులుగా కూడ పనిచేశారు. నిజమైన గాంధేయవాది మవలంకర్.

— డి రామలింగం
'యోజన' లో

## విప్లవసింహం

బాబా పృథ్వీసింగ్ అజాద్ 1989 మార్చి 5న, తన 97 వ ఏట కన్ను మూశారు. అయన మరణంతో భారత దేశం గొప్ప స్వాతంత్ర్య యోధుణ్ణి కోల్పోయింది. గదర్ విప్లవ వీరులతో కలసి ఆయన 1914 లో నౌకలో భారత దేశం రాగానే బ్రిటిష్ ప్రభుత్వం నిర్బంధించి మొదటి లాహోర్ కేసులో ఉరిశిక్ష విధించింది. ఆ తరువాత శిక్షను జీవిత ఖైదుగా మార్చి అండమాన్ సెల్యులార్ జైలుకి! 1921 లో జైలు నుంచి మారుస్తున్న సమయంలో రైల్లోంచి దూకి పారిపోయారు. 1931 మార్చిలో ఆయన కరాచీ చేరుకున్నారు. ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్ సహాయంతో పఠాను వేషంలో భారత సరిహద్దులు దాటి ఆఫ్ఘనిస్థాన్‌లోంచి

తుర్క్‌మనిస్తాన్‌కు చేరుకున్నారు. అక్కడ అయనను అరెస్టు చేసి తాష్కెంట్‌కు తీసుకు వచ్చారు. ప్రముఖ భారతీయ విప్లవకారుడని తెలుసుకున్న వెంటనే మాస్కోకు పంపారు. తరువాత బోల్షివిక్ పార్టీలో సభ్యుడయ్యారు. తిరుగు ప్రయాణంలో అయిన కాబూల్లో పట్టుబడి 13 నెలల పాటు అక్కడి జైలులో నిర్బంధితులై నారు. 1938 మే 18 న అయన గాంధిజీకి లొంగి పోయారు. 28 ఏళ్ల జీవిత ఖైదు నిమిత్తం రావల్పిండీ జైయికు పంపారు. గాని గాంధిజీ 1941లో అయనను విడుదల చేయించారు. గాంధి ఆశ్రమంలో వుంటూ గాంధిజీకి అత్యంత స్నేహ పాత్రులై నారు బాబా పృథ్వీసింగ్ అజాద్.

—వ్యాసభాగం
'సోవియట్ భూమి'

## 'వరవిక్రయం'

సి. పుల్లయ్యగారు 'వరవిక్రయం' తీస్తారని వినగానే చిత్ర పరిశ్రమలోని చాలా మంది సందేహాలు వెలిబుచ్చారు. 'మాలపిల్ల', 'రైతుబిడ్డ', 'మళ్లీ పెళ్లి' మొదలైన చిత్రాలను ప్రఖ్యాత దర్శకులు తీసి, విజయం సాధించగా చాలామంది అనుమానంగా మాట్లా డారు. కాని పుల్లయ్య గారు అదొక 'చాలెంజ్' గా తీసుకుని చక్కని పాత్రదారుల్ని ఎన్నుకొని చక్కని సంగీతంతో 'వరవిక్రయం' చిత్రాన్ని అద్భుతంగా రూపొందించారు. విడుదలైన అన్నిచోట్లా విశేషమైన ప్రజాదరణ పొందింది. మద్రాసు బ్రాడ్వే టాకీసులో ఆ చిత్రాన్ని విడుదలై, అన్ని భాషల వారినీ ఆకర్షించి, సంచలనం సృష్టించింది. సంచలనాత్మక, సమస్యాత్మక చిత్రాలను పుల్లయ్యగారు కూడా అద్భుతంగా రూపొందించగలరని, విమర్శించిన వారందరికీ అర్థమైంది. అప్పట్లో ఆర్కెస్ట్రా అంటే, మన భారతీయ వాద్యాలతో, తక్కువ సంఖ్యలో వుండేది. కాని 'వరవిక్రయం' రీ - రికార్డింగ్‌లో మాత్రం విదేశీయ వాద్యాలు చోటు చేసుకున్నాయి. కలకత్తాలో 'ఫెర్పోస్ ఆర్కెస్ట్రా' అని వుండేది; అది బిటిష్ వారి అధ్వర్యంలో వున్న ఒక క్లబ్‌లో వుండేది. పుల్లయ్యగారు ఆ ఆర్కెస్ట్రా నిర్వాహకుడితో సంప్రదించి, ఆ ఆర్కెస్ట్రాను రప్పించి, దృశ్యాలకు అనుగుణంగా, కావలసిన రీతిలో చెప్పి వారిచేత నేపథ్య సంగీతాన్ని వాయింపజేశారు. మొత్తం రీ - రికార్డింగ్ అంతా ఆ విదేశీయ ఆర్కెస్ట్రాతోనే జరపడంతో, అందరికీ అది కొత్తగా వినిపించింది. ఒక వంక పాటలు, పద్యాలూ అన్నీ మన బాణీలో వున్నా, నేపథ్య సంగీతం విదేశీయ పదతిలో వుండేసరికి, సంగీత పోకడలో వైవిధ్యం వినిపించింది: సి. పుల్లయ్య గారిని, 'స్టార్ డైరెక్టర్' అనీ 'రివొల్యూషనరీ డైరెక్టర్' అనీ అన్నారు.

—అడ్డాల నారాయణరావు
'విజయ చిత్ర'లో

# మానవ ప్రగతి

## రుద్రాక్ష

హిందువులు రుద్రాక్ష, తులసి, స్ఫటిక, గాజు, పగడము మొదలైన వాటితో చేసిన దండలను హెచ్చుగా ఉపయోగిస్తుంటారు. వీటన్నిటిలో 'రుధ్రాక్ష' అత్యుత్తమమైనదని చెప్పబడినది. రుద్రాక్ష శాస్త్రీయనామము 'ఎలీయొకార్పసీ' - అనగా వృక్ష శాస్త్రీయ పరిభాషలో చెప్పాలంటే 'ఎలీమోకార్పసీయా' సంతతికి చెందినది. దక్షిణాసియా, ఉత్తర ఆస్ట్రేలియా, ఫసిఫిక్ ద్వీపాల్లో ప్రధానంగా ఇండోనేషియా మొదలైన ప్రాంతాలు ఈ రుద్రాక్షకు జన్మస్థలాలు. భారత ఉపఖండంలో ఇది నేపాల్‌లో ఎక్కువగా పెరుగుతుంది. రుద్రాక్షల్లో మొత్తం 25 రకాలు ఉన్నాయి. హిమాచల్ ప్రదేశ్ ఉద్యానవన విభాగంవారు ఇటీవల 'సోలన్' జిల్లాలోని కల్కా వద్దగల పర్వానో నర్సరీలో 5 ఎకరాల విస్తీర్ణంలో 50 'ఎలీయో కార్పస్ గానిట్రస్' రకానికి చెందిన రుద్రాక్ష చెట్లను పెంచడంలో కృతకృత్యులయ్యారు. 1974లో ఇక్కడ నాటిన చిన్న మొక్క ఈనాడు పెరిగి పెద్దదయి రుద్రాక్ష గింజల ఉత్పత్తి చేస్తోంది. రుద్రాక్ష విత్తనాలకు దీనిని 'తల్లిచెట్టు' గా పరిగణిస్తున్నారు. ఈనాడు ఈ నర్సరీలో పెంచుతున్న మొక్కలను ఒక్కంటికి 25/- చొప్పున కొండప్రాంత ప్రజలకు, ముఖ్యంగా అస్సాం, బీహార్, బెంగాలు, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ వారికి అందచేస్తున్నారు. రుద్రాక్ష చెట్టు మధ్యతరహా ఎత్తులో ఉండి, సతతహరితంగా 25 అడుగుల ఎత్తు వరకు పెరుగుతుంది. మూడడుగుల వ్యాసం గల కాండంతో ఉండే ఈ చెట్లకు సాధారణంగా 2 కొమ్మలు మాత్రమే ఉంటాయి. వీటి పూలు మృదువైన రెక్కలతో మంచి సువాసనతో ఉంటాయి. ఈ చెట్లు అలంకార శోభితమై మార్చి నుండి మే నెలల మధ్య కాలంలో పుష్పించి ఫలదీకరణం చెందుతుంటాయి. దీని కాయలు కసరు స్థాయిలో చేదుగా నున్నా, పండిన తర్వాత మనుషులు, పక్షులు కూడా ఆనందంగా ఆరగించేంత మధురంగా ఉంటాయి. 'రుద్ర' అనగా శివుని పేరు - 'అక్ష' అంటే

'కన్ను' అని అర్థము. అనగా రుద్రాక్ష అంటే శివునికన్ను అని అర్థం. రుద్రాక్ష పూసలు అనేక రకాలుగా ఉంటాయి. ఒక రుద్రాక్ష చెట్టు ఒకసారి ఒకేవిధమైన, లేదా రెండు విధాలైన రుద్రాక్షలను మాత్రమే అందిస్తుంది. ఈ రుద్రాక్షల్లో 'ఏకముఖి', 'ద్విముఖి', 'అష్టముఖి', 'దసముఖి' రుద్రాక్షలు ప్రసిద్ధిగాంచి నవి. కొన్ని కొన్ని రుద్రాక్షలపై ఉండే ముళ్లు శివలింగం ఆకారంలో రూపొంది ఉంటాయి. ఇటువంటి రుద్రాక్ష పూసలు భగవదంశ కలిగి, ధరించిన వారి సమీపానికి భూత, ప్రేత, పిశాచాలను రానివ్వవని ప్రజల నమ్మకము. అందువల్ల ఈ రకమైన రుద్రాక్షధర అనూహ్యంగా ఉంటుంది. పవిత్రమైన ఈ రుద్రాక్ష తనని ధరించినవారి దరికి దుష్టశక్తులను రానివ్వదనే నమ్మకంతో పాటు, రుద్రాక్ష పండు గుండె జబ్బులు, ఎపిలెప్సీ, టైఫాయిడ్, న్యూమోనియా, పెప్టిక్ అల్సర్ వంటి అనేక మొండి రోగాలకు ఔషధమని చెబుతారు.

## 'ఎమ్ ఇజి'

సజీవంగా వున్న మనిషి మెదడు పనితీరును పరిశీలించడానికి, మెద డులో సంకేతాలు ఎక్కడ 'ప్రాసెస్' అవుతున్నదీ తెలుసుకోవడానికి, మెదడు 'కార్యకలాపాలు' మామూ లుగా వున్నాయా, లేక అసాధారణంగా జరుగుతున్నాయా అనేది కనిపెట్టడానికి 'ఎమ్ ఇజి' తోడ్పడుతుంది. మెదడు అతి దుర్బలమైన అయస్కాంతా క్షేత్రాలను సృష్టిస్తుందనే అంశం వైద్య విజ్ఞానరంగంలోని ఈ అద్భు తాంశానికి ప్రాతిపదిక అయింది. ఈ అయస్కాంత క్షేత్రాలను కనుగొనడం వల్ల మనిషి మెదడులోని ఏభాగం చురుకుగా వున్నదీ. లేక ధ్వని, కాంతి లాంటి వాటికి ఏభాగం ఎలా ప్రతి స్పందిస్తున్నదీ స్పష్టంగా తెలుస్తుంది. మనిషి శరీరంలోను, మెదడులోను అయస్కాంత క్షేత్రాలున్నాయని, వీటిని కనుగొన వచ్చునని, కనుగొని వైద్య రంగంలో వినియోగించుకో వచ్చునని పరిశోధకులు భావించడం గత దశాబ్దంలో మాత్రమే తటస్థిం చింది. మూర్ఛ వ్యాధి, మైగ్రేన్ వల్ల ఏర్పడే తలనొప్పి మొదలైన రుగ్మతల విషయంలో ఈ 'పరిశోధనా' ఫలితా లను ఉపయోగించుకోవాలని వైద్య శాస్త్రవేత్త లిప్పుడు ఆశిస్తున్నారు. మెదడులో గల అయస్కాంత క్షేత్రా లను 1968లో తొలిసారిగా కనుగొన గలిగారు. ఆనాటి మాగ్నెటో మీటర్లు కంటె అధునాతనమైనవి నేడు కనుగొన్నారు.

## కేంద్రీయ విద్యాలయ

1962 నవంబరులో, తరుచుగా బదిలీలు జరుగుతుండే కేంద్ర ప్రభుత్వోద్యోగులు, ప్రధానంగా సైనిక విభాగాల్లో పనిచేసే వారి పిల్లల చదువుకు కలిగే ఆటంకాలను నివారించే ఉద్దేశ్యంతో ఒకేవిధమైన పాఠ్యప్రణాళికతో దేశవ్యాప్తంగా

కేంద్రీయ విద్యాలయాలను ప్రారంభించాలని కేంద్రపభుత్వం నిశ్చయించింది. ఈ మార్గంలో ప్రారంభ చర్యగా 1963 లో సైనికోద్యోగుల పిల్లలు అధిక సంఖ్యలో నున్న 20 రెజిమెంటల్ స్కూళ్లను కేంద్రీయ విద్యాలయాలుగా మార్చడం జరిగింది. ఆ తర్వాత ఈ విధానంపై అత్యధికంగా వచ్చిన డిమాండును తట్టుకోటానికై 1988 - 89 సం. వరకు దేశవ్యాప్తంగా మొత్తం 743 కేంద్రీయ విద్యాలయాలను ప్రారంభించవలసివచ్చింది. ఈ విద్యాలయాలు న్యూఢిల్లీలోని సెంట్రల్ బోర్డు ఆఫ్ సెకండరీ ఎడ్యుకేషన్ వారికి అనుబంధంగా పనిచేస్తాయి. ఇటువంటి విద్యాలయాలు మన రాష్ట్రంలో హైదరాబాదు, సికింద్రాబాదు, గుంటూరు, మెదక్, విజయవాడ, అదిలాబాద్, తాండూరు, రామగుండం, కర్నూలు, గుంతకల్లు మొదలైన ప్రాంతాల్లో మొత్తం 28 ఉన్నాయి. వీటిలో సైనికోద్యోగుల పిల్లలకు 8 కేటాయించబడ్డాయి. ఈ కేంద్రీయ విద్యాలయాల నిర్వహణ 'కేంద్రీయ విద్యాలయ సంఘటన్' యాజమాన్యంలో జరుగుతుంది. పరిపాలన సౌలభ్యం కొరకు ఈ సంస్థకు దేశవ్యాప్తంగా 15 ప్రాంతీయ కార్యాలయాలను ఏర్పరచటం జరిగింది. వీటిలో ఒకటి హైదరాబాదులో 1981లో ఆంధ్ర, కర్ణాటకలలోని మొత్తం 48 కేంద్రీయ విద్యాలయాలను పర్యవేక్షిస్తోంది. ❁

## నెహ్రూ వాణి

ఒక ఉన్నత లక్ష్యం కోసం పాటు పడుతున్న సామాన్యులం మేము. ఆ ఉన్నత లక్ష్యంలోని గొప్పతనమే మా మీద నీడలా పడుతోంది.

1947 జూన్ 03



# పాతికేళ్ళనాటి పిక్చర్

## సురేష్‌వారి 'ప్రతిజ్ఞా పాలన'

'పాతాళభైరవి' వరవడిలో వచ్చిన జానపద చిత్రమిది. నాలుగైదు సాంఘికాలు అయాక ప్రేక్షకాభిరుచి అద్భుత రసంపట్ల ఎలా ఉంటుందో ప్రయత్నించి చూదామనుకుంటారు నిర్మాతలు. అటువంటి ప్రయత్నమే చేశారు రామానాయుడు .... ధర్మం నాలుగుపాదాలా నడిచేందుకు సరస్వతీ వల్లభుడైన బ్రహ్మదేవుడు, శత్రుం జయుడనే మునికి చంద్రాయుధ మిచ్చి ఈ భూలోకానికి పంపుతాడు. ఆయనగారు రాజశేఖర నామంతో (కాంతారావు), ప్రజలను కన్న బిడ్డలవలె చూసుకుంటూ, మధ్య మధ్య ప్రజాస్వామ్య సూత్రాలు పలుకుతూ, రాజ్యపాలన సాగిస్తూంటాడు. దేశం సుభిక్షంగా ఉంటుంది; ప్రజలు సుఖులై వుంటారు. ఇలా వుంటూండగా నాలుగు కాళ్ల ధేనువుకి ఒకకాలు పోతుంది; అంటే, ధర్మం కుంటువడిం దని అర్థం. సరిగ్గా అదే సమయాన ఒక బ్రాహ్మణ బాలుడు నాగుపాము కాటువేయగా చనిపోతాడు. తండ్రి బతికుండగా కొడుకు మరణించడం రాజశేఖరు డంతటి ధర్మ ప్రభువు సహించగలడా? అంచేత, ఆ బాలుని బతికించి తండ్రికి వొప్పగించేదాకా సింహాసనం మీద కూచోనని ప్రతిజ్ఞ చేస్తాడు. పెళ్లి కాని రాజుగారు, పట్టమహిషి పక్కన లేకుండా, సింహాసనాధిపత్యానికి ఎలా అర్హుడయాడనేది మనం అడక్కూడదు .... ఈ రాజశేఖరుడు సాహస విహారయాత్ర ప్రారంభిస్తాడు. మొదట అనంగమోహినిని (విజయలక్ష్మి), ఆ తర్వాత చంద్రకళని (రాజశ్రీ) కలుసుకు, యిరువురి ప్రేమకూ పాత్రుడై, ప్రేమ డోలికలతో ఆగక, తన గమ్యమైన ఆరందముని (రాజవాల) కలుసుకుంటాడు. ఈ యక్ష కాపాలికుడు నవకపాల హోమం జరుపుతున్నాడు; ఎనిమిది పుర్రెలు యివ్వడం అయిపోయింది. ఇక, తొమ్మిదో పుర్రెకోసం చూస్తున్నాడు. రాజశేఖరునికీ ఆరంద మునికీ రకరకాలుగా యుద్ధం జరిగిన మీదట, చంద్రాయుధ సంపన్నుని చేతిలో కాపాలికుని మరణం తథ్యం గనక దుష్టశిక్షణ జరుగుతుంది - అనంగ మోహిని ఆత్మార్పణ గావించుకుంటుంది. ఒక పత్నీవ్రతుడైన రాజుగారు చంద్రకళతో, పునర్జీవితుడైన బ్రాహ్మణ బాలునితో, నగరప్రవేశం గావించడంతో, గోమాతకు నాలుగో కాలు మళ్లీ మొలుస్తుంది.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - జులై 1965.

# కొత్త పుస్తకాలు

తెలుగు పత్రికలు - సాహిత్యసేవ
రచన : డా॥ తిరుమల రామచంద్ర.
ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన, భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు 500001. వెల రు. 5-00.

తెలుగు పత్రికల సాహిత్య సేవను తిరుమల రామచంద్ర ఈ 72 పేజీల పుస్తకంలో పొందుపరిచారు. "తెలుగునాట తెలుగులో వచ్చిన సాహిత్య పత్రికల గురించి" వ్రాసిన పుస్తకమిది. తెలుగులో పత్రికలు ఎప్పుడు ఆవిర్భవించాయి? ఎచ్చట నుండి ప్రచురితమైనవి? తొలి తెలుగు పత్రిక, తొలి వారప్రతిక, తొలి బాలసాహిత్యం, తొలి మహిళా ప్రతిక, తొలి తెలుగు కథానిక. తొలి భావకవితాబీజాలు - వీటి పుట్టుక, పెరుగుదల ఏవిధముగా జరిగినది- మొదలగు విషయములన్ని ప్రామాణికముగా సేకరించి యిచ్చారు రచయిత. ఆనాటి దినపత్రికలలో ప్రచురింపబడిన లేఖలు పొందుపరచడం వలన ఆనాటి సామాజికదృక్పథము, భాషా సాహిత్యాల వ్యాప్తి, ప్రభావము మనకు సులభముగా బోధపడతాయి. సుమారు 150 సం॥ల పత్రికా చరిత్ర ఎంతో ఆసక్తికరముగాను, విజ్ఞానదాయకముగాను తెలియపరచిన రచయిత కృషి శ్లాఘనీయము. 1900 వరకు తెలుగు పత్రికారంగంలో పాతఘట్టం సమాప్తమైందని చెపుతూ, పత్రికలు చేసిన కృషిని వివరించారు. తదుపరి పత్రికలలో వచ్చిన మలుపు, కాంగ్రెస్, తదితర పార్టీల వల్ల ప్రజల భావాల్లో వచ్చిన మార్పు, జాతీయోద్యమ ప్రభావంతో మాతృదేశభాషా సారస్వతాలపై కలిగిన మార్పు విశదీకరించారు. 1907 లో వెలువడిన శ్రీపాదవారి "వందేమాతరం" నుండి 1946-75-మధ్యకాలంలో వెలువడిన పత్రికలు ఎవరు నడిపినది, ఏవిషయమై ఆ పత్రిక ప్రాముఖ్యత వహించినదీ; విపులంగా వివరించటంవల్ల పత్రికా ప్రపంచంలో జరిగినమార్పు స్పష్టముగా తెలుస్తున్నది. 20 వ శతాబ్దంలో దినపత్రికలు, వారపత్రికలు సాహిత్య, రాజకీయాలకేకాక, కథలు, వ్యాసాల్కు సమీక్షలు, విమర్శలు, ప్రచురించినవైనం, పత్రికాభాష శిష్టవ్యవహారం నుంచి క్రమంగా వ్యావహారిక భాషకు మారడమూ విపులంగా తెలియచేశారు. చివరిమాటగా పాతపత్రికలలో జరిగిన పండితుల ఉత్తర ప్రత్యుత్తరాలమీద

ప్రత్యేక పరిశ్రమజరగాలని, ఆ ఉత్సకత, జిజ్ఞాస నవయువకులలో ఏర్పడాలి. అనీ సూచించారు.

❖ ❖ ❖

'హెలన్ కెల్లర్' - జీవితగాథ. రచన: డా॥ ఎన్. మంగా దేవి. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞానభవన్, 4 - 1 - 435 బ్యాంకు స్ట్రీట్, హైదరాబాదు - 500001. వెల: రు. 7-00.

ప్రతి బాలుడు చిన్నతనంలోనే విశిష్ట వ్యక్తిత్వంగల వ్యక్తుల జీవిత చరిత్రలు చదవాలి. హెలన్ కెల్లర్ అద్భుత జీవితగాథ – బాలబాలికల కోసం సులభ శైలిలో రచయిత్రి చెప్పారు. విధివంచితురాలయినా ఆత్మ స్థైర్యంతో, తన మూగ, చెవిటి, గ్రుడ్డితనాన్ని జయించి ప్రపంచ ప్రఖ్యాతి పొందిన ఈమె జీవితగాథ ఒక కథవలెగాక కొత్త తరహాగా చెప్పారు. ఒకకుటుంబంలో పిల్లలు పెద్దలు మధ్య సంభాషణగాను, చిలిపి కజ్జాలలాగను అందరు కలిసి బ్లైండ్ స్కూలుకి ఎక్స్‌కర్షన్ వెళ్లినట్లుగాను చెప్పి అక్కడ ఏ రకంగా చదువు నేర్చుకుంటూ తమ అవిటితనాన్ని జయించి బ్రతకటం నేర్చుకుంటారో చక్కగా విడమర్చి చెప్పారు రచయిత్రి. అవయవాలన్ని సరిగ్గా వుండీ, యితరులు చేయలేని పనులు, అంకుఠిత దీక్షతో హెలెన్ కెల్లర్ సాధించినతీరు బ్లైండ్ స్కూలు టీచరు ద్వారా చెప్పించటం బాగున్నది; ఈ పుస్తకం చదివిన ప్రతి వారికి బ్రెయిల్ లిపి గురించి పూర్తిగా అర్ధమవుతుంది. పిల్లలు చదవవలసిన పుస్తకం. స్కూలు లైబ్రరీలలో వుండతగినది.

—వాణీమోహన్

## ఈ మధ్య అందినవి :

'నవభావన' - ఆవుల సాంబశివ రావు. మూర్తి ప్రచురణలు, విశాఖ పట్నం - 3 .... రు. 20 - 00

Tripuraneni Ramaswamy by Justice Avula Sambasiva Rao... 'Telugu University, Kala Bhavan Saifabad, Hyderabad - 500 004... Rs. 20-00.

'మరోమారు కల్పవృక్షము' - వడలి మందేశ్వరరావు, కవిప్రభా, త్రివేణీప్రెస్ మచిలీపట్నం .... రు 10-00.

'సాహిత్య మీమాంస' - అసోసియేషన్ ఆఫ్ కాలేజ్ లాంగ్వేజి టీచర్స్ (తమిళనాడు), వెవి యస్సె సెన్ మూర్తి - 21, రాజేశ్వరీ స్ట్రీట్, రాజారామ్ మెహతా నగర్ మద్రాసు-29 .... రు. 10-00.

'కాంతి స్వప్న' - కావ్యఖండిక .... జివి పూర్ణచంద్రు. స్పందన సాహితీ సమాఖ్య, మచిలీపట్టణం.... రు. 8-00

'కుటుంబరావు సాహిత్యం' - ఆరవ సంపుటం .... రు. 55 - 00; 'జీవితమే నాటక రంగం' - శ్రవ్యనాటక సంకలనం .... కె. చిరంజీవి.... రు. 16 - 00; 'మొక్కల పెంపకం' - యలమంచిలి వెంకటప్పయ్య .... రు. 11 - 00; 'మెదడుకు మేత' -

మహీధర నళినీమోహన్ రు. 19-00 .... పై పుస్తకాలన్నీ ప్రచురించిన వారు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ విజ్ఞాన భవన్, 4 - 1 - 435, బ్యాంక్ స్ట్రీట్ హైదరాబాదు - 500 100. బ్రాంచీలు : విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం, హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

'విభవ' - డా॥ జిఎన్ రెడ్డి అభినందన సంచిక - ప్రముఖుల వ్యాసాలు .... రు. 25-00 ; 'The Influence of English on Telugu Literature (1800 - 1950) ... రు. 40-00 'Selected Essays of CP Brown (1798-1884) on Telugu Literature and Culture'... Editor : Prof. GN Reddy... Rs 35-00. ... జియన్ రెడ్డి జీవితరేఖలు .... పైపుస్తకాలు ప్రచురించినవారు : ఆచార్య జియన్ రెడ్డి షష్ట్యబ్ది సంఘం, తిరుపతి.

అందుకున్నవన్నీ గాకపోయినా, కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడతాయి.

లాటరీలు, పోటీ పందాలు ఎన్ని తమాషాలు ప్రకటించినా రెండూ రెండూ ఎప్పుడూ నాలుగే అవుతుంది.

ఎక్కడైతే రహస్యమూ, మిస్టరీ ప్రారంభమవుతాయో అక్కడే జనిస్తాయి దుష్టత్వమూ దగుల్బాజీతనమూను. —జాన్సన్

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచన మృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 00 |
| మనసులోని మనసు | 25 00 |
| ఆలోచించు | 9 00 |
| రాగరక్తిమ | 18 00 |
| మేఘాల మేలిముసుగు | 16 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతకనేర్చిన జాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 35 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |

20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు. ముందుగా ఆ పుస్తకాల ధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V.P.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.

## 1776 జులై - ఆ నాలుగు రోజులు

# స్వాతంత్ర్య పత్రం



**మూడువైపుల నుంచి ముట్టడించి, తిరుగుబాటు సేనలకు బుద్ధి చెప్పాలని వ్యూహం పన్నింది బ్రిటన్. అయితే, తమ స్వాతంత్ర్య జ్యోతిని కాపాడు కొనేందుకు ఎటువంటి త్యాగాలకైనా సంసిద్ధంగా ఉన్నారు వివేకధనులైన అమెరికనులు .... ఇక చదవండి.**

బర్గానీ ప్రయత్నాన్ని ఏదోవిధంగా నిరోధించాలని ఆర్నాల్డ్ పట్టుదల. బర్గానీ సేనలను తను ఎంతకాలము ఆపితే, న్యూయార్క్‌లోని వాషింగ్టన్ సైన్యానికి అంత తెరిపి.

కనెక్టికట్ వాసి అయిన బెనడిక్ట్ ఆర్నాల్డ్ వయసు 35. దేహ పుష్టిగల ఈ సేనాని గ్రీకు వీరునివలె కన్పట్టే వాడు, విపరీతమైన ధైర్య సాహ సాలతో. పట్టినపట్టు విడువని సేనాని ఇతను. న్యూ హెవెన్ పట్నములో గ్రంథ విక్రేతగాను, మందుల వ్యాపారి గాను జీవితము ప్రారంభించిన ఈ వ్యక్తి ఇరవై అయిదో ఏట తన స్వంతనౌకలు నిర్మించుకొని వెస్టిండియా దీవులతో వ్యాపారము ప్రారంభించాడు. సాహస నౌకావ్యాపారానికి ఇతనిని పేర్కొనేవారు.

బాస్టన్ హత్యలు జరిగినపుడు ఆర్నాల్డ్ తన మిత్రునికి ఇలా వ్రాశాడు : "అమెరికనులు నిద్రిస్తున్నారా ? లేక, తమ స్వాతంత్ర్యాన్ని ధారాదత్తం చేస్తు న్నారా ?" స్వరాష్ట్రము చేరుకున్న వెంటనే, కనెక్టికట్ సేనకు సైన్యాధికారి అయాడు. మిత్రుడు సైలాన్ డీన్ టి కొండెరగా కోటలోని, రాజుగారి ఆయుధాగారాన్ని పట్టుకోమని సలహా చెప్పగా, 1775 వసంతకాలములో పర్వతప్రాంతాలవున్న సాహస యువకు లతో ఆ కోటపై ఒక ప్రాతఃకాలాన ముట్టడి జరిపాడు. తన సైనికోద్యోగి ఎల్లెన్ కోటలో వారిని వెంటనే లొంగి పొమ్మని కబురుపంపాడు. "భగవంతుని పేరుతో కాంగ్రెస్ సభ వారి ఆదేశ ప్రకారము మేము మిమ్మల్ని లొంగి పొమ్మని ఆజ్ఞాపిస్తున్నాము" అన్నారు ఈ సాహసికులు. ఒక్క తుపాకీ పేల్చ కుండా కోట పడిపోయింది.

తను శత్రువుని జయించలేక పోయినా, శత్రుగమనాన్ని ఆపగలడు. శత్రువుని ఎదిరించి కొంతవరకు పోరా టము సాగించి, శత్రువు వేసుకున్న పథకాన్ని తలక్రిందులు చేయగలిగితే తన కర్తవ్యం నెరవేరినట్లవుతుంది - అని అనుకున్నాడు ఆర్నాల్డ్. క్రౌన్ పాయింట్‌వద్ద జరిగే పోరాటము బర్గాని సేనలు ముందుకు చొచ్చుకు వెళ్ళేందుకు ఆటంకమవుతుంది. ఇక్కడి తన పోరాటము జయప్రదము కాక

పోవచ్చు గాని, న్యూయార్క్ రేవును, వాషింగ్టన్ సేనను కాపాడి తీరుతుంది.

జులై రెండవ తేదీన న్యూయార్క్ నగరము, జనరల్ వాషింగ్టన్‌పై, ప్రముఖ సైనికోద్యోగులపై తలపెట్టిన హత్యాప్రయత్నం సంగతి విని, దద్దరిల్లి పోయింది. ఈ కుతంత్రములో న్యూయార్క్ మేయరే గాక వాషింగ్టన్ అంగరక్షకులలో విశ్వాసపాత్రుడైన సార్జెంట్ థామస్ హికీ కూడా వున్నాడు.

కర్టీనియస్ అను సైనికోద్యోగి తన స్నేహితునికి ఇలా వ్రాశాడు: "నిన్న రాత్రి ఒక నీచాతి నీచమైన కుట్ర బయటపడింది. వాషింగ్టన్, పుట్నామ్ మొదలగు సేనాధిపతులను హత్య చేయాలని రహస్య ప్రయత్నము వెల్లడయింది. ఈ ద్రోహులలో కొందరిని వెంటనే బంధించారు. వారిలో పట్నపు మేయరైన మాత్యూస్, ఆయుధ నిపుణుడైన గిల్బర్ అంగరక్షక దళంలోని ఒక వాద్యగాడూ వున్నారు. సామాన్య సైనికులు తిరుగుబాటు చెయ్యాలనీ, అందులో కొందరు ఆయుధగారానికి నిప్పంటించాలనీ పన్నుగడ పన్నారు. మరి కొంద రురింగ్స్ బ్రిడ్జినికూల్చి వేసి, న్యూఇంగ్లండు నుంచి ఇక్కడికి రాగల సప్లయి ఆగిపోయేటట్లు చూడాలి; ఒకానొక సంకేతంతో ఈ తిరుగుబాటు దారులు విప్లవసైన్యంలోని తమ సోదరులపై తుపాకులు కాల్చి, వారిని హత మార్చాలి: సార్జెంట్ హిక్కీ నమ్మకద్రోహి అని రక్షణ కమిటీవారు కనుగొన్నారు. అతను అన్యదేశపు ధనాన్ని మారుస్తూ వుండడము ఆచోకీదారులు కనిపెట్టి, ఇందులో ఏదో తంత్ర ముండాలని అనుమానించి, వెంటనే అతనిని తమ కస్టడిలోకి తీసుకున్నారు. జైలులో ఇతను బంధింపబడి వున్నపుడు అనేకులు ఇతనికి చూడ్డానికి రావడమూ, ఆ వొచ్చిన వారితో ఇతను కొంచెము గర్వముగానూ నిర్లక్ష్యముగానూ మాట్లాడటమూ, ఐసాక్ కెచమ్ అనే ఒక ముసిలి పింఛన్‌దారు విన్నాడు.

"నేను ఈ అమెరికా కోసము చస్తే పోరాడను. నా కోవకు చెందినవారు ఈ సైనికపటాలలో అనేకులు వున్నారు. వారందరికీ ఆంగ్లేయులు డబ్బు పంచిపెట్టుతున్నారు. బ్రిటిషు నౌకాదళము వచ్చీరాగానే, వీరందరూ అమెరికనులపై ఎదురు తిరిగి హత మారుస్తారు."

ఐసాక్ తాను విన్న ఈ మాటలను న్యూయార్క్ అసెంబ్లీకి వెంటనే తెలియబరిచాడు. అసెంబ్లీ వారు తక్షణము విషయపరిశీలన గావించమన్నారు. కమిటీ సభ్యులు సార్జెంటు హిక్కీని విచారించారు. తను ఆ మాటలు అనలేదనీ అదంతా అభూతకల్పన అనీ దబాయించాడు హిక్కీ! అతను జైలులో వుండగా చూడ్డానికి వచ్చిన కొందరిని ప్రశ్నించారు. కమిటీ సభ్యులు అందులోని గిల్బర్ట్ అను ఆయుధ నిపుణుని అనుమానాస్పదునిగా భావించి విచారణ ప్రారంభించారు.

దేశద్రోహ మనగా మరణదండన. బెదిరిపోయిన గిల్బర్టు తనకి తెలిసిన దంతా చెప్పి వేశాడు. వాషింగ్టన్ అంగరక్షకులలో కొందరిని విద్రోహ వర్గము డబ్బిచ్చి కూడగట్టుకున్నదని చెప్పేశాడు. మేయర్ మాథ్యూస్ ద్వారా తనకా డబ్బు ముట్టుతోందనీ, అది తను ఇతరులకు పంచుతున్నాననీ ఆ అందుకుంటున్న వారిలో హిక్కీకూడా వున్నాడనీ వొప్పుకున్నాడు. ఇది తెలిసిన వెంటనే జనరల్ నెతానియల్ గ్రీన్, మేయర్ మాథ్యూస్ భవనముపై దాడి చేసి, ఇల్లంతా శోధించి, అతనికి సంకెళ్ళువేసి, సిటి హాలు జైలుకి తీసు కెళ్ళిపోయాడు. కోర్టుమార్షల్ జూన్ 26 వ తేదీ బుధవారము నాటికని నిర్ణయింపబడింది. కోర్టు మార్షల్‌లో పరిశీలిస్తున్నపుడు, సార్జెంటు హిక్కీ వాషింగ్టన్ అంగరక్షకులలో మరో ఎనమండుగురిని యిందులో యిరికించాడు. నేరస్తులు ఇచ్చిన వాగ్మూలాలను పరిశీలించిన మీదట సైనిక న్యాయస్థానము ఎనమండుగురు అంగరక్షకులను ఆయుధనిపుణుడు గిల్బర్టునూ, మేయర్ మాథ్యూస్‌లను కనెక్టికట్‌లోని విచ్‌ఫీల్డు కారాగారానికి తీసుకుపోవలసినదిగా శాసిస్తూ, సార్జెంటు హిక్కీకి వురిశిక్ష విధించారు. హిక్కీని వురితీసిన మధ్యాహ్నం, జనరల్ వాషింగ్టన్ ఒక ప్రకటన జారీ చేశాడు. "దేశద్రోహ







రానికి వురితీయబడ్డ థామస్ హిక్కీ నికృష్టజీవిత సమాప్తిని మీరందరూ చూశారు. విద్రోహచింతనులకు అదే ప్రతిఫలమవుతుంది. ఇది సైనికు లందరికీ హెచ్చరిక. సైనికుడన్నవాడు ఇటువంటి నీచకార్యానికి పూనుకో రాదని, సైనిక మర్యాదకీ సైనిక ధర్మానికీ ఇటువంటి హేయకార్యాలు మాయని మచ్చలవుతాయనీ సైనికు లందరినీ హెచ్చరిస్తున్నాను."

ఆ శుక్రవారము నాడు సర్ పీటర్ ఫార్కర్ ఛార్లెస్టన్‌పై ముట్టడి జరి పేందుకు సమయ మాసన్న మైందని భావించాడు. తను పట్నాన్ని ఆక్ర మించే ముందు రేవు మొనలోవున్న సల్లివాన్ దీవిలోని కర్రకోటను భస్మీ పటలం చేయాలి. రెండురోజుల ముందు సర్‌పీటర్ ఒక చిన్న నౌకను సల్లివాన్ కోటకు పంపాడు. ఆ నౌకపై తుపాకులు పేల్చబడ్డాయి. కొంచెము సేపు అయాక కోటనుంచి ఒక వుద్యోగి సర్ పీటర్ వద్దకు వచ్చాడు. కర్నల్ మౌల్ట్రీ క్షమార్పణ తెలుపుతున్నా డనీ, ఆ నౌకపై ఎగురుతున్న పతాకపు అంతరార్థం తెలియలేదనీ ఆ అంత రార్థం చెప్పమనీ కోరాడు. లోబడి హొమ్మని ఆదేశమది - అన్నాడు సర్ పీటర్ - 'అబ్బే, అటువంటి దెన్నటికీ జరగదు,' అని నిర్భయంగా తెలిపాడు మౌల్ట్రీ. రెండుసార్లు ఫిరంగులు పేలేసరికి వాళ్ళే మనసు మార్చు కుంటారు - అని భావించాడు, సర్ పీటర్. కోటకు వుత్తరముగా వున్న లాంగ్ ఐలెండ్‌లో క్లింటన్ సేనానీ కారన్‌వాలిస్ సేనాని రెండువేల అయిదు వందల పటాలంతో సిదంగా వున్నారు.

దక్షిణాన ముఖ్య రేవు అనదగు ఈ పట్నాన్ని సంరక్షించేందుకు ఫిలడల్ఫియాలోని పెద్ద యుద్ధాల్లో ఆరితేరిన ఛార్లెస్ లీ ని యిక్కడకు పంపారు. బక్కగా, కొంచెము పొడ వుగా వుండే నలభై అయిదు సంవత్స రాల ప్రాయముగల ఈ సేనాని, తన సైనికదుస్తుల విషయంలో నిర్లక్ష్యముగా వుండేవాడు. మాటలో తొందరబాటు, ఆవేశములో మతిభ్రమ కలిగిందా అనిపించే ప్రవర్తనా, సాహ సంలో ముందు వెనుకలు చూడని వురుకూ మొదలైనవి ఇతని గుణాలు. ఇరవై సంవత్సరాల క్రితము అతను యుద్ధాల్లో పాల్గొన్నాడు. 1762 లో యూరప్‌లో ఇతను కొన్ని సైనిక ఘనకార్యాలు చేశాడు. పోర్చుగల్ రాజు ఇతనిని మెచ్చుకున్నాడు. ప్రష్యా ప్రభువు ఫ్రెడరిక్ ది గ్రేట్ వద్ద కొంత కాలము పని చేశాడు. పోలెండులోని స్టానిస్ లాస్ రాజువద్ద సైనికాధికారి పదవి నిర్వహించాడు. 1769 లో రష్యన్ సేనలు టర్కిష్ వారిపై యుద్ధము ప్రకటించినపుడు రష్యన్ సేనలకు నాయకత్వము వహించాడు. మూడు సంవత్సరాల క్రితమే ఇతను అమెరికా వచ్చాడు. వలసల స్వాతం త్ర్యం కొరకై పొరాడే యోధులలో ఒకనిగా పేరు బడ్డాడు. మూడవ జార్జినీ అతని మంత్రులనీ అతి తీవ్రంగా విమర్శించేవాడు. ఇతన్ని పట్టి యిచ్చిన

వారికి అయిదువేల పౌనులు బహుమతి బ్రిటిష్ వారు ఇస్తామని ప్రకటించారు. మూడు వారాల క్రితము ఛార్లెస్టన్‌కు వచ్చి బ్రిటిష్ నౌకాదళాన్ని ఎదిరించేందుకు ఆ ప్రాంతము తీసుకొంటున్న రక్షణ సన్నాహాలని పరికించాడు. దాడి జరుపనున్న సేనలను రెండువేల మంది వాలంటీర్లు ఎదిరించేందుకు సంసిద్ధులవుతున్నారు. కల్నల్ మౌల్‌ట్రీ అధిపత్యాన రెండవ రెజిమెంటు, సల్లివాన్ దీవి కోటలో వుంది. విశాలమైన రోడ్లు, అందమైన మేడలతో కూడిన ఛార్లెస్‌టన్ పట్నము ఇరుకైన సైనిక శిబిరంగా మారిపోతోంది. దక్షిణ కెరోలినా అధ్యక్షుడైన రట్లెడ్జ్, సైనికాధిపతి అయిన మౌల్‌ట్రీ ఈ పట్నాన్ని కాపాడేందుకు, సలివాన్ దీవి కాపాడుకోడము ముఖ్యమని భావిస్తున్నారు. 16 అడుగుల ఎత్తుగల ఇసుక నేలపై నిర్మింపబడినదీ కోట - సముద్రము వైపుగా వున్న గోడకు రెండు పెద్ద ఫిరంగులు వున్నాయి. దక్షిణము వైపుగా వున్న గోడకు అనేక చిన్న ఫిరంగులు అమర్చబడి వున్నాయి. వెనుక వైపునా ఉత్తరము వైపునా వున్న గోడలు ఇంకా నిర్మాణదశలోనే వున్నాయి. వాటి ఎత్తు పదడుగులు. వాటిని కాపాడడము చాలా కష్టము. ఈ కోటను చూసి ఛార్లెస్ లీ పెదవి విరిచాడు.

సర్ పీటర్, బ్రిస్టల్ అను పతాక నౌక ఉపరిభాగంపై నిలబడి, యాభై







ఫిరంగుల నౌకను గర్వముగా చూసు కొంటూ యుద్ధ ప్రారంభానికి ఎదురు చూస్తున్నాడు. ఉదయం తొమ్మిది గంటల వేళ సర్‌పీటర్ సంకేతం ఇచ్చాడు. అధిక బలసంపదగల తన నౌకా సిబ్బంది, ముందునించి దాడి జరిపేటట్లు, వుత్తరాన్నించి సర్ క్లింటన్ లూర్డ్ కారన్ వాలీస్‌లు చికాకు పరిచే టటు ఈ రెండు వైపుల యుద్ధములో అదను చూచుకొని తన సైనికులు తీరంపై దిగేటట్లూ యుద్ధ తంత్రము ఏర్పాటు చేశాడు సర్‌పీటర్. పద కొండు గంటలయేసరికి చుట్టూ ప్రదేశ మంతా రెండువందల నౌకా ఫిరంగు లతో కుతకుత లాడిపోతోంది. సలి వాన్ దీవి కోట వూగుతోంది. వణుకు తోంది. గడగడ లాడుతోంది తప్ప పడడం లేదు. కోటలోని మనుషులు దాడి చేస్తున్న వారి తుపాకులకు ఎదురు కాల్పులు సాగిస్తున్నారు. ఇరవై ఎనిమిది పెద్ద ఫిరంగులు కోట లోని రక్షణ నిస్తున్నాయి. ఈ కర్ర కోట స్పాంజివలె మెత్తగా వున్నది. బ్రిటిష్ నౌకాదళము పేలుస్తున్న గుళ్ళు ఇసకలో కూరుకు పోతు న్నాయి. కర్ర అంటుకున్నట్లు గాని, విరుగుతున్నట్లుగాని శబ్దం రావడం లేదు. నావికులు గురి చూసి పేలుస్తున్న ఫిరంగి గుళ్ళు విఫలమవు తున్నాయి. ఎందువల్లనంటే ఈ కోట వెనుక కందకాలన్నీ ఇసుక దిబ్బలతో కూడి వున్నాయి. అతి నేర్పరులైన నావికులు కూడా విఫలమవుతున్నారు. కాని కోట నుంచి పేలుస్తున్న ఫిరం గులు బ్రిస్టల్ నౌకను ధ్వంసము చేస్తు న్నాయి. సముద్ర కెరటాలు గాని అటు పోటు సమయములో బ్రిస్టల్ నౌకను కొంచెము తీరస్థంగా తీసుకు వెళ్లాయా, కోటలోని వారు దీనిని తూట్లు పొడిచేటట్లున్నారు.

పతాక నౌకలోని సర్ పీటర్ తన కళ్ళ ముందు జరుగుతున్నది నమ్మ లేకుండా వున్నాడు. అతని నౌకా బల ములోని ఉత్తమ నౌకలన్నీ దెబ్బ తింటున్నాయి. కొన్ని పని చేయడమే మానుకున్నాయి. ఉత్తరదిక్కు నుంచి రావలసిన క్లింటన్ కారన్ వాలీస్‌లు రంగంపై కనపడడం లేదు.

దెబ్బతిన్న తన పతాక నౌకపై ఆగ్రహావేశుడై పచార్లు చేస్తున్న సర్ పీటర్ తన నావికులని యింకొంచెము తీవ్రముగా ఎదుర్కోమన్నాడు. సైన్యా ధిపతి ఆదేశానుసారము మరి కొంచెము తీవ్రముగా ఫిరంగులు పేలాయి. మధ్యాహ్నము రెండూ మూడు గంట లయేసరికి కోటనుంచి సమాధానంగా కొద్దిగా పేలాయి. మూడు గంటలవేళ కోట నిశ్శబ్దమయింది. ఈ యుద్ధం తీర ము నుంచి చూస్తున్న జనరల్ ఛార్లెస్ లీ కోటలోని మనుషులు ఇంత గొప్పగా ఎదుర్కోగలరని అనుకోలేదు ఇక కోట పని అయిపోయింది. ఛార్లెస్ లీ, అతని సైనికులు యుద్ధాన్ని సాగించవలసి వుంది. (ఇంకా వుంది

—మాతృక : కార్నెల్ లెన్‌గ్వెల్

—తెలుగు : యర్నార్ చందూర్

కథానిక

# చిన్నారి శీతల

### పూజిత

మద్రాసు స్టేషన్‌లో రైలాగింది. "సార్ కూలి కావాలా?" మావారి ముందుకొచ్చి అడిగాడు ఒక కూలి.

"ఆఁ" అని సామానంతా ఎత్తించారాయన. "వర్ధినీ....రామ్మా" అని పిలిచారు అత్తగారు.

పెళ్ళయిన పది రోజుల నుండి గమనిస్తూనే వున్నా ఆయన ఎంత జాగ్రత్త మనిషో!.

డ్రైవర్ కారు తీసుకు వచ్చి వున్నాడు. కారులో ఎక్కిన అరగంటకి ఇల్లు చేరుకున్నాం. కొత్త కోడల్నికదా! ఇంటి దగ్గర మంగళ హారతి, ఎర్రనీళ్ళు దాటింపులాంటి చిన్న ఆచారాలు జరిగాయి.

"కుడి కాలు పెట్టమ్మాయ్"-ఎడమ కాలు లోన పెట్టబోతున్న నేను, అత్త గారి సలహాతో చఱ్రున వెనక్కు లాక్కుని, కుడికాలు పెట్టాను. నేన వన్నీ నమ్మేదాన్ని కాదు. అయినా కొత్త కోడల్ని వస్తూనే ఎదిరించడం బావుండదు. అందులో మా అమ్మ, అత్తగారింట్లో ఎలా మసలుకోవాలో, పెళ్ళికి నెల రోజుల ముందు నుండి బాగా నూరిపోసింది. ఆ పవర్ ఇంకా నాలో స్ట్రాంగ్‌గానే వుంది. కిమ్మన కుండా వాళ్ళు చేసే ప్రతి పనికి తలూపాను. అది నా ఇష్టంతోనే, ఆ ఇష్టం దేనికంటే .... నన్ను ఆయన కానీ కట్నం తీసుకోకుండా పెళ్ళాడారు - ఆ అభిమానమే!

మావారు, అంటే వాసుదేవరావు, మా అత్తగారు, మా మామగారు, మా ఆడబిడ్డ శీతల, నేను మొత్తం ఆ ఇంటిలోని వ్యక్తులం.

వాసుగారి ఆఫీసుకు ఇంకా నాలుగు రోజులు శెలవు వుండటంతో మద్రాసు మహానగర మంతా చూపించారు. గోల్డెన్‌బీచ్ మహాబలిపురం, స్నేక్ పార్క్, ఎల్. ఐ. సి. బిల్డింగ్ యిత్యాదులు.

ఒకరితో పని లేదన్నట్లు హడా వుడిగా వెళ్ళే ఆ జన సంచారం,.... మెరీనా బీచ్ .... ఇసుకలో ఆవెన్నెల వేళ మనసుకు నచ్చిన మావారి చేయి పట్టుకు కూచున్నప్పుడు, కథలు రాయాలనే బలీయమైన కోరిక కలిగింది. చదువుకొనే రోజుల్లో స్కూలు మాగ్ జైన్‌లో రాసిన కలం .... మళ్ళీ చేపట్టాలనే వాంఛ చెలరేగింది.

ఆ నాలుగు రోజులు నాలుగు క్షణాల్లా గడిచిపోయాయి. వాసుగారు ఆఫీసుకెళ్ళి పోయారు. శీతల స్కూలు కెళ్ళిపోయింది. మామగారు రిటయిర్డ్

గనక, ఆ పెద్ద వారిద్దరు కాస్సేపు కబుర్లు చెప్పాకు, పుస్తకం పుచ్చుకు, ఓ మూల కూర్చుండి పోయేవారు. లేదా, రేడియో, టి.వి. ఇక నాకు టయిమ్ పాస్ అయ్యేది ఒక సమస్య అయ్యింది. ఫ్రండ్స్‌తో అనవసరమైన కబుర్లుచెప్పుకుంటూ టయిమ్ గడపటం ... నా స్వభావం కాదు.

తోటలో కొత్త పూలమొక్కలు నాటించాను. కొత్తసీనరీలు డ్రా చేసి, డ్రాయింగు రూమ్‌లో తగిలించాను. కుట్లు, అల్లికలు! అయినా నాలో ఏదో వెలితి; ఏదో చేయాలనే తపన. ఒక రోజు మావారి నడిగాను - జాబ్ చేస్తానని! అన్ని విశాల భావాలున్న ఆయన, అందుకు అంగీకరించలేదు. "ఇప్పుడు నీకేమి తక్కువ? నీవు నా అర్ధాంగివి. ఈ ఇంటి సామ్రాజ్యానికి మహారాణివి. ఇంతబాధ్యతను వదులుకొని, వేరేచోట జాబ్ చేయడమా ?.... ఐ .... డోంట్ .... లైకిట్" అని నిర్మొహమాటంగా చెప్పేశారు. ఆయన అలా చెపుతుంటే కోపంతో నా ముక్కుపుటలు ఎగిసి పడ్డాయి, ఆత్మాభిమానంతో నా కళ్ళు చెమర్చబోతుండగా .... ఆయన దగరకు తీసుకుని, 'వర్షినీ.... నీవు బి.ఎ. పూర్తి చేశావు కదా! ఎం.ఎ. చదువు. చిన్న చిన్న ఉద్యోగాలుచేయాల్సిన అవసరం నీకు లేదు. నాకు మంచి జీతం వస్తుంది. మనకి ఆస్తివుంది - ఎందుకమ్మా జాబ్ నీకు' అంటూ బుజ్జగించారు.

మొదట ఉక్రోషంతో ముఖం తిప్పేసుకున్నా, తరువాత మెత్తబడి, ఎం.ఎ. చేసేందుకు అంగీకరించాను. మరునటి రోజే బుక్స్ తెచ్చి ఇచ్చారు. కొన్నాళ్లపాటు ఇంట్లో కూర్చుని అదే పనిగా చదివేసరికి బోర్ కొట్టేసింది. ఏదైన వ్యాపకం కావాలని మనసున పరితాపం మొదలయింది. నాలోవున్న ఆ చిన్ని కళను వృద్ధి చేసుకోవాలని, కలంతీసుకుని కథ రాయాలంటూ కాయితాలు కరాబు చేస్తూండేదాన్ని. అయినా ఒక్కటి కూడా సరిగా కుదరక, పదాలు దొరక్క, సక్రమంగా రాయలేక, ఎలా మొదలుపెట్టాలో, ఎలా పూర్తిచేయాలో తెలియక, తికమక పడేదాన్ని.

ఏ మాగ్‌జైన్‌లో కథల పోటీ అని చూసినా, వెంటనే గబ గబ కథ రాసి పోస్ట్ చేసేదాన్ని, కాని ఒక్కటి కూడా అచ్చయిన పాపాన పోలేదు. ఠంచన్‌గా తిరిగి వచ్చినన్ను వెక్కిరిస్తూండేవి.

కష్టం, నష్టం తెలియక నీడపట్టున పెరిగిన నేను, ఒక్క కథ అయినా, హృదయం స్పందించే ట్రాజడీగా రాయాలనుకుంటే, కుదిరేది కాదు. అత్తగారేమన్నా కష్టపెడితే తెలిపేదాను కుంటే, మా అత్తగారు చాలా మంచిది. పోనీ వానుతో అయినా పోట్లాట పెట్టుకుందామంటే, ఆయన అలాంటి అవకాశమే కల్పించేవారు కాదు. శీతల పోకిరి పిల్లా అనుకుంటే, ఆ పిల్ల వదినగారి కొంగు పట్టుకు తిరుగుతుంది. పోనీ కట్న సమస్యలా అంటే అదీలేదు. ఇంట్లో కాయకష్టం చేయాలంటే కూడ అవకాశం లేదు. నిక్కితాష, కాయకూరలతో సహా కట్

చేసే మిక్సీ, వాషింగ్ మిషన్, క్లీనింగ్ మిషన్ వగైర, వగైరా ఆధునికమైన పరికరాలు, పైగా సర్వంట్స్. ఇలాంటి సుఖమైన జీవితాన్ని ఆనంద డోలకల్లో వూహించి తెల్లకాయితాల మీద రాసి పంపిస్తే, తిరిగి రాక ఏమవుతాయి ? ఇక్కడ కష్టాలున్నాయా ? కన్నీళ్ళున్నాయా ? పైగా వాసు ఓదార్పు : "వర్ధినీ .... డోంట్ వరీ, ఇవన్నీ తిరిగి వస్తున్నాయంటే ముందు ముందు నీవొక జాక్ లండన్‌వి అవుతావేమో !" ఆయనెవరో అడగాలనిపించినా గుట్టుగా అడగలేదు.

శీతల ఒక్కతే, తిరిగి వచ్చే నా కథల్ని కనుమాటుగా చదివేది. చదివి నవ్వుకుంటూ వుంటే అది హేళనో, మెప్పో తెలిసేదికాదు. కాని నిరాశ చెందకూడదని పట్టుదలగా కథలు రాస్తూండేదాన్ని.

మా ఇంటికి ఒక చుట్టం వచ్చింది. ఈమె నాకథకు సబ్జెక్ట్ అవుతుందేమోనని ఆశపడ్డాను. మా అత్తగారి పిన్నమ్మకూతురట.... ఆమె పేరు జయమ్మ. ఆమె కెందుకో లోకం మీద చెప్పలేని అసూయ, "కోడలెంత అపురూపం అయినా అంత అభిమానం పనికి రాదక్కా - కోడలు, కోడలే, అత్త అత్తే. ఇలా నెత్తికెక్కించుకుంటే ఆపైన దిగదు - కట్నం తీసుకురాని కోడళ్లని అసలు నమ్మకూడదు " అంటూ అను నిత్యం మా అత్తగారికి నూరిపోసేది. మా అత్తగారిలో మార్పు వస్తుందేమో అని చూశాను. ఏమీ మార్పు లేదు. ఆ శనీశ్వరి మాటలు ఈ చెవితో విని, ఆ చెవితో వదలిపెట్టేసేవారామె.

కొన్నాళ్ళకు ఆ జయమ్మతల్లి వెళ్ళిపోయింది - నా కథకు ఇతి వృత్తం ఇవ్వకుండానే.

ఎం.ఎ. పరీక్షలు దగ్గర కొచ్చాయి. నేను అన్నీ మరచి కష్టపడి చదవటం ప్రారంభించాను. కానీ, అప్పుడప్పుడు కథ రాయాలనే కోరిక మెదడుని దొలుస్తూవుండేది. బలవంతాన కోరి కను అపుకునే, కష్టపడి చదవి పరీక్షలు రాశాను. పరీక్షలైపోగానే కథ రాయాలనే కోరిక మరింత వుధృత మయింది. ఏర్ కండీషన్డ్ రూములో కూచుని కథ రాయటం మొదలుపెట్టాను. ఎందుకైనా మంచి దని వేస్ట్ పేపర్ బాస్కెట్ ఎప్పుడూ పక్కనే పెట్టుకుంటాను.

వాసుగారు రూమ్‌లోకి వచ్చేసరికి, కాగితపు వుండలతో ఒక బాస్కెట్ నిండిపోయింది. ఆయన కొంటె నవ్వుతో - "వర్ధినీ నీవెప్పుడూ రెండు బాస్కెట్స్ పక్కన పెట్టుకు కూచో - నీ వ్రాతకు ఒక్కటి సరిపోదు, ...." అన్నారు.

అప్పటికే కథ కుదరక అలసి పోయి వుండటంవల్ల, ఆయన చిలిపి మాటలకు కోపం రాలేదు. ఇంతలో, "వర్ధినీ.... అబ్బాయీ నీవు ఒకసారి ఇలా రండి - మీ మామగారు పిలుస్తు న్నారు" అని పిలిచారు అత్తగారు. ఏదైన ముఖ్యమైన విషయం మాట్లాడా లంటేనే అలా పిలుస్తారు. కొంప తీసి "ఇక కథలు రాయటం మానేయ్ అమ్మాయ్" అని చెప్పేందుకు కాదు కదా! వాసుగారి వెనుక వెళ్ళాను.

హాలులో సమావేశం. మామగారు చెప్పారు. శీతలకు సంబంధం చూశా రట. మా అభిప్రాయం అడుగు తున్నారు. అది విని క్షణం .... నివ్వెర పోయి, నోరావళించి, అలాగే వుండి పోయేను. వాసు ఏదో అంటున్నారు. మామగారు మాట్లాడుతున్నారు. కానీ, నాకు ఇవేమి వినిపించడం లేదు .... "అంత చిన్న పిల్లకు అప్పుడే పెళ్ళా ?" అనేదే నాలో.

నా చేతి మీద వాసు గిల్లగా అపుడు తెలిసింది - నన్ను మామగారు ఏదో అడుగుతున్నారని

"నీకూ ఇష్టమే కదమ్మా" అని అడిగారు.

"లేదండి" - నా సమాధానం విని అందరితో పాటు, గాలి కూడా స్తంభించినట్టు, క్షణకాలం అంతా నిశ్శబ్దమైపోయింది. నేను చెప్పింది వాళ్ళెవరూ నమ్మలేనట్లున్నారు ... ఎందుకంటే, నేను ఎప్పుడూ మామ గారితో ధైర్యంగా ఎదురు మాట్లాడి ఎరుగను. ఈరోజు అలా నిక్కచ్చిగా చెప్పాను.

"ఏమ్మా ఎందుకని ?" ఆయన నింపాదిగానే అడిగారు.

"శీతల వయసు చాలా చిన్నది. ప్లస్‌టు మాత్రమే ముగించింది. ఇంకా కొన్నాళ్ళు పోతే బాగుంటుందేమో." అన్నాను తలదించుకునే.

ఆయన నిట్టూర్చి, "నిజమే అమ్మా ! నీవు చెప్పేది బాగానేవుంది. కానీ.... ఇంత మంచి సంబంధం మళ్ళీ దొరక్క పోవచ్చు. ఆడపిల్ల ఇంకా చదివి మటుకు ఏమి చేస్తుంది. పెళ్ళయ్యాక కావాలంటే నీలాగే ప్రవేటుగా చదువు కోవచ్చు" అన్నారు.

అందరు ఆడపిల్లల తండ్రుల డైలాగ్సే అయనా వల్లించారు. వాసు, నేను ఎంతగానో నచ్చచెప్పాలని ప్రయత్నించాం. అత్తమామలు ఒప్పు కోలేదు. "వాసు పెళ్ళయిపోయింది. శీతలకు కూడా అయిపోతే నిశ్చింతగా, రేపోమాపో మేము పోయినా, గుండె లో భారమంటూ ఏముండదు" అని వారి మాటనే నెగ్గించు కున్నారు, వాసుకి కూడా ఇష్టం లేదు. తండ్రి మాటను ఒప్పుకున్నారు. అదీకాక ఆ అబ్బాయి మంచి పొజిషన్‌లో వున్నా డట. ఏదో ఫాక్టరీ మేనేజరట. శీతల పెళ్ళి ఇంకొన్నాళ్ళు ఆపమని వాసుతో చెప్పాను. కానీ, అయన కూడా ఏమి చేయలేక పోయారు. పెళ్ళిచూపులు, నిర్ణయాలు అయిపోయాయి.

నేను ఎం. ఎ. పాసయ్యాను. శీతల ప్లస్టు .... మంచి మార్కులతో పాసయింది. శీతల్ని చదివిస్తే తప్పక బాగాచదువుతుంది అంత మంచి మార్కులొచ్చాయి ఆ అమ్మాయికి.

పెళ్ళి ముహూర్తాలు పెట్టు కున్నారు. ఇక, కథ రాయాలనే కోరిక పక్కన పెట్టి పెళ్ళిపనుల్లో పడి పోయాను.

పెళ్ళి వైభవంగా జరిగిపోయింది. ఇన్నాళ్ళు మాతో వున్న శీతల, అత్త

వారింటి కెళుతుంటే .... నాకు దుఃఖం .... ఆగిందికాదు. ఇద్దరం ఒకరి నొకరు పట్టుకుని బాగా ఏడ్చు కున్నాం.

"వదినా, కథ రాయాలనే ప్రయ త్నం మానెయ్యకు - రాస్తూవుండు," అని చెప్పి ఆ చిన్నారి వెళ్ళిపోయింది.

ఆడపిల్ల అన్నాక పెళ్ళి కోసమే పుట్టిందన్నట్టు, రెండు లక్షల కట్నం తో, కన్నకూతుర్ని, సుఖాల దొంతర లోకి పంపినట్టు, నిశ్చింతగా వుండి పోయారు మా అత్తమామలు.

వాసు, నేను వెళ్ళి అప్పుడప్పుడు చూసివస్తుండే వాళ్ళం. రాను రాను శీతల రంగు తగ్గింది, సన్నబడింది. ఆ కళ్ళల్లో కళ తగ్గిపోసాగింది. శీతల మాతో ఏదో చెప్పాలనుకొని అత్తగార్ని చూసి భయపడేది. శీతల్ని ఆ ఊరి లోనే వున్న పుట్టింటికి పంపేందుకు ఇష్టపడేవారు కాదు అత్తమామలు, భర్త.

"శీతల్, ఏమిటమ్మా ఇలా అయి పోయావు ? ఎందుకిలా వున్నావు ?" దగ్గరగా తీసుకొని అడిగాను - ఒక రోజున.

ఏడ్చింది - వెక్కి, వెక్కిఏడ్చింది. "వదినా .... నాకు అన్నయ్యలాగా కట్నం తీసుకోని వాళ్ళతో పెళ్ళిచేసి వుండకూడదూ ?" అని భోరున ఏడ్చింది.

"ఏమిటమ్మా .... ఏమిటి నీవనేది ....?" అనడిగాను.

"అదే వదినా .... పులి .... ఒక్క సారి మనుష్యుల్ని తింటే - మానీటర్‌గా మారిపోతుంది. అలాగే కట్నం తీసు కోకుండా వుండాలిగాని.... తీసుకొనే వాళ్ళకి యింకా రాబట్టాలనే ఆశ చావదు .... బ్రతికినంత కాలం పీడిస్తూనే వుంటారు"

ఆమాటతోటే నాకు కొంత అర్థమై పోయింది. అంతలోనే ఆమె అత్తగారు అక్కడికొచ్చి, "ఏమిటమ్మ అలా నూరి పోస్తున్నావ్? ఎంత అన్నా, వదిన అయినా మటుకు, ఇలా అడుగడుక్కి వస్తారా.... ఆడకూతురింటికి ?" అని ఈసడించింది. మాఇద్దరికి కోపం వచ్చింది. శీతల్ని అప్పుడే మాతో వచ్చేయమని చెప్పాం. శీతల నవ్వి .... "వద్దు వదినా.... నాన్న మిమ్మల్ని అపార్థం చేసుకుంటారు. మీరెళ్ళండి నేను తర్వాత వస్తాను" అని చెప్పింది.

శీతల్ని వదలి రాలేక, రాలేక వచ్చాం. అయినా ఆ అమ్మాయి చుట్టూ వుంది నామనసంతా.

కథ రాయాలని ముందులాగ, నా మనసులోకి వచ్చే ఆలోచనల్ని తెల్ల కాయితాల మీద గీకేయాలని లేదు. శీతలలాంటి వారు ఎందరు ఉన్నారో ? ఆ దీనగాథ లెన్నో ! పుట్టిన ప్రతి ఆడదీ పెళ్ళి కోసమే కాదు, ఆమెకు ఆశలుంటాయి, తెలివి తేటలుంటాయి, కోరికలుంటాయి, ఆమెకు ఒక జీవితాన్ని ప్రసాదించండి. పెళ్ళిపెళ్ళంటూ స్త్రీ జీవితాన్ని సమాధి చేయవద్దు - అని ప్రబోధించాలనే ఉద్రేకం.... ఉప్పొంగి పోయింది మనసులో.

ప్రతి నిమిషం శీతలే గుర్తు కొస్తోంది. ఆరాత్రి శీతల్ని గూర్చి భయంకరమైన కలలొచ్చాయి. తెల్ల వార్లూ నిద్ర లేదు. తెల్లారేక వాసుతో చెప్పాను.

"నీవు ఎప్పుడూ శీతల్ని గురించే ఆలోచిస్తున్నావు. అందుకే అలా అన్పిస్తుంది. సాయింకాలం త్వరగా వస్తాను. రెడీగా వుండు - వెళ్ళి శీతల్ని చూచి వద్దాం" - చెప్పారు వాసు.

మామగార్ని అడిగాము.... శీతల్ని తీసుకొస్తాం, చాలా చిక్కిపోయిందని. పెళ్ళయ్యాక కొందరు చిక్కిపోతారని అత్తగారు.... చిన్న పిల్లకదా బెంగ పెట్టుకుని వుంటుందని మామగారు, ఒకరికొకరు సర్ది చెప్పుకున్నారు.

"నేను రెండు రోజుల ముందు శీతల దగ్గరకు వెళ్ళాను - బాగానేవుంది. వాళ్ళు బాగానే చూస్తున్నట్టున్నారు," అని మాకు చెప్పారు గాని అప్పుడు ఆయన వాళ్ళ కిచ్చిన ఇరవై వేల సంగతి చెప్పలేదు - మామగారు మాతో.

ఆ రోజంతా కాలు కాలిన పిల్లిలా తిరిగాను. ఫోను చేస్తే ఎవరూ రిసీవ్ చేసుకోలేదు.

మా అత్తగారికి వివరించి చెప్పాను శీతల్ని గురించి.... "ఆడపిల్లకు పెళ్ళి చేసి అత్తవారింటికి పంపేస్తే, మీ బాధ్యత.... తీరిపోయిందనుకోవద్దు. చచ్చినా, బ్రతికినా ఆమెకి అత్తగారిల్లే మోక్షమని భావించొద్దు .... శీతల్ని చూస్తే గుండె నీరయిపోతోంది" అని చెప్పగా ఆమె సాయింకాలం మాతో వచ్చేందుకు ఒప్పుకున్నారు.

సాయంకాలం ఎప్పుడు అవుతుందా, వాసు ఎప్పుడు వస్తారా అని ఎదురు చూస్తున్నాను. వాసు త్వరగానే వచ్చేశారు. "మీ అమ్మగారు కూడ వస్తున్నారు - శీతల్ని తీసుకువస్తారు" అని చెప్పగా వాసు ముఖంలో రవంత వెలుగు రేఖ కదిలింది.

ముగ్గురం బయలుదేరాం. గుమ్మం దాటబోతుండగా ఫోను మ్రోగింది.

తిరిగివచ్చి నేనే రిసీవ్ చేసుకొన్నాను. ఆ ఫోన్‌లో వార్తకు.... "శీతల్" అంటూ కేకపెట్టాను. నాకేకతో ఇల్లంతా దదరిల్లిపోయింది. ....అక్కడే కుప్పలా కూలిపోయాను.

"ఏమయింది.... వదినీ?" .... వాసు వచ్చి ఫోనందుకున్నారు. గ్యాస్ లీక్ అయి శీతల్ కాలి పోయిందని, అందరూ వినిపించే వార్తని.... సునాయాసంగా వినిపించారు వాళ్ళు.

రాత్రంతా నా చుట్టూ తిరుగుతూ "వదినా.... నీవు ....కథ రాయాలనుకున్నావు కదూ! నాకథ రాయి, వదినా.... రాస్తావు కదూ ?" అనే చిన్నారి శీతల, కన్నీరు నిండిన నాకళ్ళల్లో నిలిచి దీనంగా అడిగింది.



కాలిబాట లేని అడవులలో ఆనందం వుంది: ఒంటరితీరాన వేకువ కాంతి వుంది; సముద్ర గర్జనలో సంగీతం వుంది; అందుకని ప్రకృతి నెక్కువ ప్రేమించి మనిషిని తక్కువ చేయను. —లార్ బెరన్

## చిత్రజగతి

## సమీక్షలు

### మహేశ్వరీ పరమేశ్వరీ వారి 'స్టేట్ రౌడీ'

ఈ పిక్చర్‌లో స్పీడు ప్రధానం - జెట్ స్పీడు, మిస్సయిల్ స్పీడూను. కాళీచరణ్‌గా పరిచయమైన యాక్షన్ హీరో చిరంజీవి, ఇంటర్వెల్ అయాక పృధ్వీరాజనే పోలీసు ఇన్‌ఫార్మర్ అవుతాడు. స్టేట్ రౌడీగా అతను వీరోచిత కార్యాలు చేస్తున్నప్పుడు కూడా పోలీసు ఇన్‌ఫార్మరే! ముల్లుని ముల్లుతోనే తీయాలి గనక, యస్పి నాగమణి (శారద) భర్త అయిన వైస్ ఛాన్సలర్ ముకుందరావు (జగ్గయ్య) హత్యోదంతం వెలికి లాగేందుకు, స్టేట్ రౌడీని ముగ్గులోకి దింపుతుంది పోలీసుశాఖ - ముఖ్యంగా యస్పి నాగమణి. ఒక కాలేజీ విద్యార్థినిని దుండగుల అత్యాచారం నుంచి కాపాడినందుకు గాను ముకుందరావు దారుణంగా హత్య చేయబడ్డాడు. అత్యాచార ప్రయత్నం నుంచి రక్షింపబడ్డ యువతి, సాక్ష్యం చెప్పేందుకు ముందుకి రాదు. కురుక్షేత్ర యుద్ధంలో ఆయుధం పట్టనని కృష్ణుడు మాట యిచ్చినట్లే, స్టేట్ రౌడీ కూడా అలాటి మాట యిచ్చి తన మోటారు సైకిలుకి అమర్చిన వివిధాస్త్రాలతో శత్రువులని చిత్తు చేస్తాడు. ఇద్దరు అందమైన అమ్మాయిలు (రాధ, భానుప్రియ) యింత సమర్థుడైన హీరో వెంట పడటం సర్వసహజం. సత్యనారాయణ, సుధాకర్, త్యాగరాజన్, రావు గోపాలరావు, అల్లురామలింగయ్య - వీరివి దుష్టపాత్రలు. బప్పీలహరి సంగీతం పిక్చర్ స్పీడుకి తగట్టుగా ఉంది. కథ - మాటలు: పరుచూరి బ్రదర్స్. దర్శకత్వం: బి గోపాల్. నిర్మాతలు: సుబ్బరామిరెడ్డి, శశి భూషణ్.

### విజయ కళ్యాణీ వారి 'గూఢచారి 117'

నలుగురు సైంటిస్టులను బంధించి, వారు కనిపెట్టిన 'ప్రోగ్రెసివ్ శాటిలైట్ ఫార్ములా రాబట్టి, అది విదేశాలకు అమ్మి, ఐశ్వర్యవంతుడవుదామనుకుంటాడు దేశద్రోహి అయిన ఒక విలన్ (ఆహుతి ప్రసాద్), ఈ నలుగురు సైంటిస్టుల వునికి తెలుసుకు, వారిని సజీవంగా కాపాడే భారం జేమ్స్‌బాండ్‌ని పోలిన 'గూఢచారి 117' (కృష్ణ)పై పెడుతుంది. భారత

ప్రభుత్వం. ఇతని వద్ద ఎన్నో వినూత్న రక్షణ కవచాలు ఉంటాయి. ఈ సీక్రెట్ ఏజంటుకి తటస్థపడ్డ ఝాన్సీ, రేఖలు (భానుప్రియ ద్వి పాత్రాభినయం), స్వ భా వం లో విరుద్ధంగా వున్నప్పటికీ, రూపంలో మాత్రం అచ్చు గుద్దినట్లు కనిపించ డంతో, ఆ గూఢచారికే గాక మనకి కూడా, ఈ అమ్మాయి 'డబుల్ క్రాస్' చేస్తున్నదా అనే అనుమానం కలగక పోదు. ఒక పాత్ర గంగి గోవు లాటిది ; మరొకటి రక్తం కళ్ల చూసేది. అత్యాధునిక ఆయుధ సం పన్నుడూ, కర్తవ్య దీక్షా కంకణుడూ అయిన 'గూఢచారి 117' శత్రు స్థావ రాన్ని పడగొట్టి, సైంటిస్టులను కాపాడుతాడు. లిటిల్ మాస్టర్‌గా మహేష్ తన పాత్రను చక్కగా పోషించాడు. మురళీమోహన్, గిరి బాబు, గొల్లపూడి మున్నగువారు న్నారు. దర్శకత్వం : కోడి రామకృష్ణ. సమర్పణ : రాయపాటి సాంబశివ రావు. నిర్మాతలు : సిహెచ్ గాంధి, డి మురళి.

## బాలాజీ ఆర్ట్ వారి 'పార్థుడు'

విదేశాల నుంచి వచ్చిన అన్నగారు, స్విస్ బాంకు లాకర్ నెంబరు చెప్పక పోవడంతో ఆయనని పరలోకానికి పంపిన ఒక సుందరమూర్తి (నూతన్ ప్రసాద్), ఆ అన్నగారి కూతురు మాల (రాధ) ద్వారానైనా సదరు నెంబరు రాబడదామని, ఆమెని రేప్ చేయబోగా, ఆ అమ్మాయి నేర్పుగా తప్పించుకు, ఒక పల్లెటూర్లో లీల అవుతుంది. మానధనుడైన హీరో (కృష్ణ) ఇరుగుపొరుగు వారి నోళ్లు మూయించేందుకు, ఆ లీల మెడలో అకస్మాత్తుగా తాళి గట్టి, ఆమె తన భార్య అంటాడు. ఈ లీలని ఇంటికి తీసుకొచ్చేసరికి, తల్లి అభ్యంతరం చెబుతుంది గాని వొదినగారు సౌజన్య (శారద), ఈ కొత్త కోడలిని కర్పూర హారతితో లోనికి ఆహ్వానిస్తుంది (జాడ తెలియకుండా మాయమైన తన భర్త (యస్వీ) ఆచూకీ, పోలీసు ఉద్యోగి అయిన ఈ మరిది బయటికి లాగ వలసి వుంది. తన భార్యను హంతకు రాలనే అభియోగం మీద హీరో పార్థుడు అరెస్ట్ చేయడంతో సౌజన్య తో బాటు ప్రేక్షకులు కూడా విల విలా దుఃఖిస్తారు. ఎక్కడికక్కడ మలుపులూ మెలికలూ గల ఈ చిత్ర కథ పరుచూరి బ్రదర్స్‌ది. సిల్క్ స్మిత ప్రేక్షకులని శృంగార వీధులలో విహరింపజేస్తుంది. దర్శకత్వం : కె యస్సార్ దాసు. నిర్మాత : వడ్డే బాలాజీరావు.

## యూనివర్సల్ వారి అరేబియన్ అడ్వెంచర్

(Arabian Adventure)

మంత్రశక్తులూ మాజిక్ కార్పెట్లూ గల అరేబియా రాజుకి ఎంత ఉన్న ప్పటికీ తృప్తి అనేది ఉండదు. ఈ సంపదలన్నిటితో బాటు 'మాజిక్ రోజ్' కూడా సంపాదించాలని ఆయన

గారి వాంఛితం. ఈ దుష్టరాజుకి, ఒక అందమైన కూతురు తప్పనిసరిగా వుండాలికద ! ఆ రాకుమారి, సాహస వీరుని శౌర్య ప్రతాపాలు కళ్లారా చూసినదై, అతనిని ప్రేమిస్తుంది. వారిద్దరికీ పెళ్లి జరిపించేందుకు దుష్ట రాజుకి అడ్డు చెప్పాడుగాని 'మాజిక్ రోజ్' తనకు తెచ్చి యివ్వాలనే షరతు పెడతాడు. సాహస వీరుడు 'ఓకే' అంటాడు; ఈ వీరునికి సాయంగా తన భృత్యుని పంపుతాడు దుష్టరాజు. రాకుమారికి తన తండ్రి మీద నమ్మకం లేదు.... సాహస వీరునికి మార్గమధ్యంలో, జేబులో ఇంద్రనీలమూ, భుజం మీద కోతి పిల్లా గల ఒక బాలుడు తటస్థ పడతాడు. వారి సహకారంతో 'మాజిక్ రోజ్' సాహస వీరుని వశమవుతుంది. అయితే దుష్టరాజు భృత్యుడు ఈ వీరుని వెన్నుపోటు పొడిచి, 'మాజిక్ రోజ్' కాజేస్తాడు. ఇంద్రనీలం సాహస వీరునికి ఊపిరి పోస్తుంది; భృత్యుని వద్ద నుంచి కోతిపిల్ల 'మాజిక్ రోజ్' లాక్కుంటుంది. దుష్టరాజు మరణంతో రాకుమారికీ సాహస వీరునికీ పరిణయం జరుగుతుంది. రాజ్యమేలే రాజు తన అధికారాన్ని నమ్ముకోవడం గాక ప్రజలను కూడగట్టుకోవాలని చెప్పే వ్యంగ్య చిత్రణ ఈ యడ్వెంచర్ స్టోరీ .... పిఆర్ఒ టియమ్ రామన్.







## విజయలక్ష్మి ఆర్ట్స్ 'గూండారాజ్యం'

ధనతృష్ణ, అధికార పిపాస, రక్త దాహమూ గల భగవాన్‌దాస్ (నూతన్ ప్రసాద్) తన ముఠాలోకి రప్పించు కుంటాడు రాజాని (కృష్ణ). బాల్యం లోనే విధి వంచితుడైన ఈ రాజా, ధన మదాంధుల పాలిట యమ్ముడు, పేదల పాలిట దేవుడు — ధర్మాత్ముడు. భువనేశ్వరిదేవి (శారద) భర్తను పొట్ట నెట్టుకున్నాడు భగవాన్ దాస్ ఒకప్పుడు - ప్రతీకారం తీర్చుకోవడమే ఆమె జీవిత లక్ష్యం. ఆమె కూతురు లత (విజయశాంతి) అందాల పాలవెల్లి. ఇక భగవాన్‌దాస్ గూండా రాజ్యానికి ప్రభువు - పోలీసులేమిటి, ప్రభు త్వాధికారులేమిటి ఆయన మాట సుగ్రీ వాజ్ఞగా పాలించవలసిందే! పచ్చి నెత్తురు తాగే విలన్ దగ్గిర, రాజా వంటి మంచివాడు కిరాయి గూండాగా చేరడం యిష్టంలేని భువనేశ్వరి, అతనిని మార్చడానికి ప్రయత్నించి విఫలు రాలవుతుంది. ప్రేమించిన లతతో చెబుతాడు రాజా తను డిటెక్టివ్ ఆఫీసరునని! హీరో చేస్తున్న సాహస కార్యాల ముందు ప్రజాస్వామ్య నినా దాలు చాలా సన్నగా వినబడతాయి. గూండాయిజమ్ నిర్మూలించి, ప్రజా స్వామ్యానికి ప్రాణం పోయనున్న ఆర్తత్రాణ పరాయణునిగా చూపారు. కృష్ణని దర్శకత్వం : కోడిరామకృష్ణ. నిర్మాతలు : వెంకట్రాజు, శివరాజు.

## రాజేశ్వరీ వారి

ఒక్కోసారిమళయాళంలో హాలీవుడ్ తో దీటైన చిత్రాలు వస్తాయి. ప్రేక్షకు లని ముగ్ధులు గావించే ఫొటోగ్రఫీ (జయనన్ విన్సెంట్) ; బాక్ గ్రవుండ్ మ్యూజిక్ (శ్యామ్) లోని సంగీత ఝురులు పరవశింపజేసే ప్రకృతిలోని అందాలను శబ్దంగా మార్చి చెబుతున్నా యా అనిపిస్తుంది. రెండు మూడు చోట్ల యడ్వంచర్‌ని నిర్హేతుకంగా పొడిగించా రని అనిపించినప్పటికీ, అది అంతగా పరిగణించ వలసిన విషయం కాదు .... మొత్తం కథ ఆర్మీ ఆఫీసరులకి, సంబంధించినది. శుష్క హాస్యము, అసందర్భపు సన్నివేశాలూ, ఎక్కడా లేవు. మోహన్‌లాల్, సురేష్, పార్వతి, విస్సి, సోమన్, గోపీ మున్నగువారు న్నారు. సురేష్‌కి, మోహన్‌లాల్ మీద, ట్రయినింగ్ రోజుల నుంచీ అసూయ ; పార్వతీ, మోహన్‌లాల్ ప్రేమించు కుంటారు ; కాని పార్వతి తండ్రి, తను సురేష్ తండ్రికి యిచ్చిన వాగ్దాన ప్రకారం, పార్వతిని సురేష్‌కిచ్చి పెళ్లి చేస్తాడు. సురేష్ ప్లేన్ క్రాష్‌లాండ్ అవుతుంది. అతని వునికి తెలుసుకు రక్షించడం మోహన్‌లాల్ పవిత్ర కర్తవ్యమవుతుంది. కథసంభాషణలు : అశోక్. ఈ సినిమా స్కోప్ చిత్రానికి దర్శకులు : అనిల్ .... పిఆర్ఒ : టి. యమ్. రామన్.

✠ ✠ ✠

# నా చిన్ననాటి ముచ్చట్లు

కెయన్ కేసరి



'గృహలక్ష్మి' కంకణ గ్రహీతలైన తెలుగు వనితలు ఈనాడు ఎందరో ఉన్నారు. 'గృహలక్ష్మి' పత్రిక ద్వారా స్త్రీ జనాభ్యుదయానికై కేసరిగారు చేసిన అద్వితీయ కృషి తెలుగువారు మరువలేనిది. అలాగే కేసరి కుటీరం, కేసరి విద్యాలయం వంటివి ఆయన పేరు చిరస్థాయిగా నిలిపే సంస్థలు, ఆత్మబలం, స్వయంకృషి, అచంచల దీక్షతో, వైద్య శాస్త్రంలోని ప్రతిభను ప్రజోపకరంగా మార్చి, సేవా గారు రతతో చరితార్థులైన కేసరి తత్ప తమ జ్ఞాపకాలను పుస్తక రూపంలో 1953 లో వెలువరించారు. ఆదర్శ ప్రాయులు, పుణ్యజీవనులు అయిన ఆ మహానుభావుని జీవిత విశేషాలు - ఆనాటి సాంఘిక పరిస్థితులకి దర్పణం వంటి అనుభవాలు - ఈ నెల నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాము.

# 1 బాల్యము, విద్యాభ్యాసము

మా తల్లికి నేనొక్కడనే సంతానము. ఆమె తనకు ఆడుబిడ్డలు లేని ముచ్చట తీర్చుకొనుటకై నాకు ఆడపిల్ల వేషము వేసి ఇరుగు పొరుగిండ్ల చూపి ఆనందించుట నాకిప్పటికినీ జ్ఞాపకమున్నది. నా 5–వ ఏటనే మాఅమ్మ నన్ను మా ఊరిలో బడికి చదవ పంపినది. ఆ బడిపంతులు పేరు పిచ్చయ్యగారు. వారికి పిల్లకాయలకు చదువు చెప్పగల సామర్ధ్యము లేకపోయినను చీటికి మాటికి వారిని బావగొట్టేవారు. అందుచేత వారిని చూస్తే పిల్లకాయలకి చాల భయముగా ఉండేది. ఆకాలములో బడిపంతుళ్లకు నెలజీతములు లేక నెలకింతని జీతముగా నిచ్చుట లేకపోయినను భోజనపదార్థములగు పరిగలను, కాయధాన్యములను, వంకాయలు, గోంగూర, పచ్చిమిరపకాయలు, మొదలగు కాయగూరలను, రైతుల పిల్లకాయలు తెచ్చిఇచ్చేవారు. అందుచే వారు పంతులుదయకు పాత్రులై యుండే వారు. అట్టివారికి దెబ్బలుండవు. ఏమీతేలేని వారికి మాత్రము, పంతులు బెత్తముతో కావలసినన్ని పేముపండ్లను ప్రసాదించేవారు. బడిలో పిల్లకాయల సంఖ్యను బట్టి ప్రభుత్వమువారు అప్పటికి కొంతకాలము నుండి, సాలీనా రొఖ రూపమున గ్రాంటు నిచ్చుచుండిరి. ఆ సర్కారు గ్రాంటుకై ఆయన తంటాలుపడి పిల్లకాయలను బడికి చేరదీసేవాడు.

కొత్తపిల్లకాయలను బడిలోకి చేర్చేనాడు బడిలో చదివే పిల్లలందరికి పప్పు బెల్లాలు పంచిపెట్టేవారు. పంతులుకు వరహా (4 రూ॥ లు) మామూలైనను అందరు ఇచ్చుకొన గలిగేవారుకాదు.

నాలుగైదు సంవత్సరములు ఆ బడిలో చదివిన మీదట పెద్దపుస్తకమును (సామాన్యముగా రామాయణము, లేనిచో భారతమో భాగవతమో) పట్టించుట జరిగేది. సరస్వతిపూజ జరిపి పిల్లవానిచేత రామాయణమును పంతులు చదివించేవారు. ఆదినమున పిల్లకాయలకు పప్పుబెల్లాలు పంచి బడికి ఆటవిడుపు (శెలవు) ను ఇచ్చేవారు. ఈ పెద్దపుస్తకముతో ఆ బడిలోని చదువు సమాప్తం. ఆకాలమున పెద్దపుస్తకము పట్టుట పూర్తిఅయినచో, బి.ఏ. పట్టా పొందుట వంటిది.

నేను పేదవాడిని గనుక పంతులుకు ఏమియు సమర్పించుకోజాలని కారణమున నాకు దెబ్బలు తప్ప చదువు అంతగా అంటలేదు. నేను బడికి కూడా క్రమముగా పోలేకపోతిని. ఏలననగా మాతల్లికి నేను కొంత సహాయం చేయవలసి

ఉండేది. మాఊరిలో గుండ్లకమ్మ అనే నదికలదు. నేను తెల్లవారగానే ఏటికి పోయి, కాలకృత్యములు తీర్చుకొని, చిన్న కావడిలో రెండు చిన్నతప్పేలాలు పెట్టుకొని, ఏటిలో నీటిని ఇంటికి తీసుకొనిపోయేవాడను. పిమ్మట చద్ది అన్నమును తిని, ఎవరి పొలములవద్దకైనాపోయి వంకాయలు, గోంగూర, పచ్చి మిరపకాయలు, దోసకాయలు మొదలైనవానిని అడిగి కోసుకొనివచ్చి తల్లికి ఇచ్చేవాడిని. మరి జొన్నకంకులు, సొజ్జకంకులనుకూడా తెచ్చుకొనేవాడిని.

మాయింటి సమీపముననే ఉప్పలవారి మర్రిచెట్టు అని, యొకపెద్ద చెట్టుఉండెను. అది యిప్పటికిని యున్నది. దాని ఆకులు చాలా పెద్దవి. విస్తరాకులు కావలసి నేను ఒకనాడు ఆ మర్రియాకులను కోయుటకై చెట్టెక్కితిని. కొంతదూరమెక్కగానే కండ్లుతిరిగినవి. పైకెక్కలేను ; క్రిందికి దిగలేను అట్లనే చెట్టుకావలించుకొని యుంటిని. పట్టుతప్పెనా నేనీపట్టున వ్రాయవలసిన అగత్యముండేదికాదు. దైవవశమున ఇంతలో మరియొకడు ఆకులను కోసుకొనుటకు వచ్చి నా అవస్థను చూచి నన్ను వాడు మోకుతో క్రిందికి దించెను. అప్పటినుండి నేను చెట్టు ఎక్కడము మాని, దోటి కట్టుకొనిపోయి దానితో ఆకులను కోసి తెచ్చేవాడను. ఆ ఆకులతో విస్తళ్లను కుట్టేవాడను. జొన్నదంటు ఈనెలను సన్నగా చీల్చి, విస్తళ్లను సన్నగా కుట్టు నేర్పరితనము నాకు ఉండేది. నేను కుట్టిన విస్తళ్లను చూచిన మిషన్ కుట్టువలె ఉండేది.

నా తల్లి రవికెలు కుట్టడంలో చాలా నేర్పరి. ఊరివారంతా మా అమ్మ వద్దకు వచ్చి రవికెలు కుట్టించుకొనేవారు. సాదా రవికెలు కుట్టిన ముక్కాలణా పూలువేసి కుట్టిన ఒక్కణా; తేళ్లు, మండ్రగబ్బలు, పక్షులు - వీనిబొమ్మలు వేసి కుట్టిన రెండుఅణాలు యిచ్చేవారు. ఆకాలమునాటి నాజూకు వస్త్రాలంకారములు పాలచాయకోకలు, నల్లచాయరవికెలు, గువ్వకన్ను, నెమలికన్ను అద్దకము రవికలు. అట్లతద్దె పండుగ వచ్చినప్పుడు ఆనాటి స్త్రీలు ఈవిధమగు చీరరవికెలు ధరించి, కొప్పులనిండ బంతిపూలు తురుముకొని కోలాహలముగా వుయ్యాల లూగుచుండెడువారు. అట్టి వినోదములు ఈనాటి స్త్రీలకు పరిచయములేవు. అవి జాతీయమగు క్రీడావినోదములు ; దేహమునకు చురుకు, పుష్టినిచ్చునవి కూడ. మాతల్లి రవికెలను కుట్టి సంపాదించిన డబ్బు మా భోజనమునకు కొంతవరకు సరిపోయేది.

ఆకాలంలో పండుగనాడు, తద్దినమునాడు మాత్రమే వరి అన్నమును తినే వారము. తక్కినదినములలో జొన్నలు, సజ్జలు, పరిగలు వాడుకొనువారము.

నెయ్యి, వరిబియ్యమును మాత్రము డబ్బిచ్చి కొనేవారము. వంటచెరకు నకై మాతల్లి పొలములబాయకెళ్లి కందిదుంపలను త్రవ్వితెచ్చెడిది. కందిమొక్కలను కోయునపుడు జానెడులోపున భూమిని విడిచి కోయువారు. ఆ విడువబడిన దానిని సమూలము త్రవ్వి తీసిన చక్కని వంట చెరకుగా ఉపయోగపడేది. తిరుగా పైరు వేయుటకు అడ్డములేకుండా ఈదుంపలు తీసివేయ వలయును. పైగా రైతులటు నిటు పొలములలో తిరుగునప్పుడీ దుంపలు పొరబాటున కాలులో గుచ్చుకొన్నచో గాయమై ఒకరాగాన మానదు. అయితే తామే త్రవ్విస్తే కూలి ఇవ్వవలెను. అందుచేత సామాన్య రైతుల ఇంటి ఆడువాండ్లు వచ్చి వారియింటికి వంటచెరకు కవసరమైనన్ని త్రవ్వితీసుకొని పోవుదురు. రైతులున్నూ, పేదవారిని ఉచితముగానే త్రవ్వి తీసుకొనిపోనిత్తురు. ఈప్రకారం మాతల్లి సం॥ నకు చాలినన్ని దుంపలను త్రవ్వి జాగ్రత్తపెట్టేది.

మా ఊళ్లో మాబంధువులు ములుకుట్ల కృష్ణయ్య అనేవారు భిక్షాటనము, పౌరోహిత్యమున తన జీవితమును గడుపుకొనేవారు. వారు అప్పుడప్పుడు మా ఊరికి సమీపములోఉండే బసవన్నపాలెమనే చిన్నగ్రామానికి భిక్షమునకు వెళ్లేవారు. నాకు ఉన్నఊరిలో బిచ్చ మెత్తుకొనుటకు లజ్జగా ఉండేది. అందుచేత కృష్ణయ్యతో కూడా బసవన్న పాలెమునకు !జోలెకట్టుకొని భిక్షమునకు పోతిని. నేను చిన్నవాడినిఅగుటచేతను, కొత్తగావెళ్లుటచేతను, ఆఊరి అమ్మలక్కలందరూ నన్ను ప్రేమతో లాలించి కృష్ణయ్యకంటే ఎక్కువగా నాకు బిచ్చము పెట్టినారు. కృష్ణయ్య జోలెకన్న నాదిపెద్దదైనది. మోయజాలనైతిని. అప్పుడు నా అవస్థజూచి కృష్ణయ్యగారు నా మూటనుగూడ కొంచెముదూరము వారే తీసికొనిరి. మధ్యాహ్నమునకు ఇంటికి చేరినాము. అప్పుడు మాతల్లి నాజోలె మూటను జూచి సంతసించినది ; గాని వెంటనే నా చమటలు, అలసట, ఆయాసము చూచి భోరున ఏడ్చినది. తక్షణమే నన్నుస్నానము చేయించి, కడుపునిండ అన్నముపెట్టి నిద్దురపొమ్మని ఆమె భోజనమునకు పోయినది. ఆమె భోజనము చేసివచ్చేలోపలనే నేను నిద్రపోతిని. నాతల్లి నాకాళ్లవైపున కూర్చుండి ఏడ్చుచుండెను. నాకు మెలకువవచ్చి 'ఎందుకేడ్చెదవమ్మా ?' అని నేనడుగగానాకాళ్లలో ముళ్లుగుచ్చుకొని యుండుటను చూపినది. నేను భిక్షాటనమునకై పోయివచ్చిన డొంకన తుమ్మముళ్లు విస్తారముగా నాకాలిలో విరిగియుండెను. వానినన్నిటిని ఆమె సూదితో మెల్లగాతీసివైచి మరల ఎన్నడట్లా భిక్షాటనమునకు పోనని నాచే ప్రమాణము చేయించుకున్నది.

మాఇంటి యెదుటనే మా మేనమామగారు ములుకుట్ల మహదేవయ్యగారు నివసించేవారు. కాని వారిసహాయము ఏమీలేకుండెను. మా మామ

గారు ధర్మరాజువంటివారు. మా అత్తగారు మాత్రము గయ్యాళిగంప. వారి ధాటికి మా మామగారేగాక ఊరివారంతా భయపడేవారు. ఆమె అమిత జగడాలమనిషి. ఎవరినైనా తిట్టదలుచుకుంటే తిట్టినతిట్టు మరల తిట్టకుండా రెండు మూడుగంటల కాలము తిట్టగల శక్తి ఆమెకు గలదు. అందువల్ల ఆమెను చూచిన యింటివారికి, వెలుపలివారికికూడా అమిత భయం. ఈ కారణమున మా మేనమామ మాకు సహాయ మొనర్పజాలకుండెను.

ఈవిధముగా సమీప బంధువుల సహాయములేక, స్వయం శక్తి చేసంపాదించి తాను వంటిపూట భుజించి, నాకు వీలువెంట రెండుమూడు పూటలు అన్నము పెట్టుచు, నాతల్లి నన్ను కంటినిరెప్పవలె పోషించుచుండెను. అప్పుడామెకష్టమును చూడలేక ఆమెతో చెప్పకుండానే మాఊరినుంచి కాలినడకన మద్రాసునకు చేరినాను.

## 2 పార్కుఫేర్ పరశురామప్రీతి

మొదటిముచ్చటలో చెన్నపట్నానికి రాకముందు మాగ్రామంలో ఉండగానే జరిగిన నాచిన్ననాటి సంగతులను చెప్పియున్నాను. ఇకపై చెన్నపట్నంవచ్చిన తర్వాత నేను పెరిగి పెద్దవాడనై, ప్రయోజకుడను కాగలుగుటకుముందు నా అనుభవములోని ఘట్టమును ఇందు వ్రాయుచున్నాను.

సుమారు 60 సం॥లకు కొంచముపైన చెన్నపట్నంలో ప్రతి డిశంబరు నెల అఖరు వారమున రాణితోటలో (పీపిల్స్‌పార్కు) వేడుకలు జరిగెడివి. వానినే "పార్కుఫేర్‌వేడుకలు" అని జనులు పిలుతురు. చెన్నపట్న మీ రాష్ట్రమునకు రాజధానికదా. వేసవి శెలవులలో రాష్ట్రియోద్యోగులు పలువురు చల్లదనమునకై ఉదకమండలములకు వెళ్లుదురు. కావున డిశంబరుశలవులు వేసవి శలవులకన్న క్లుప్తమైనను, పెద్దపెద్ద ఉద్యోగులనుచూచి ఎరుకపడవచ్చుననే ఉద్దేశముతో మండలములనుండి చిన్న ఉద్యోగులు పలువురు పనికట్టుకొని చెన్నపట్నమునకు వచ్చుట అలవాటు. బంధువు లిచ్చటయున్నవారు కొందరు కుటుంబములతోనే వచ్చేవారు. ఇట్టి పైజనము వచ్చుటచేత ఈవేడుకలకు విస్తారముగా ధనము వచ్చెడిది. మరియు అనేకవిధములగు వస్తువుల ప్రదర్శనమును, విక్రయమును జరిగెడిది.

పార్కులో బ్యాండు వాయించు స్థలమున నీ వేడుకలు జరిగెడివి. అచ్చట ఈప్రదర్శనములకై ఏటేటా టెంకాయఆకులతో వెదురుబొంగులతో పెద్దపెద్ద

రెండు ఆవరణములను కట్టేవారు. మొదటిది లోపలి ఆవరణము (Inner Circle); రెండవది వెలుపలి ఆవరణము (Outer Circle), మొదటి ఆవరణములో వెలగల వస్తువులను ప్రదర్శించేవారు,

రెండవ ఆవరణములో సోడాఅంగళ్లు, లాటరీఅంగళ్లు, కాఫీ హొటళ్లు మొదలగు వాటిని ప్రదర్శింపజేయుదురు. దుండగీడులు మొదటి ఆవరణపు తడికల పైనెక్కి లోనికి దూకకుండ దానిని చౌకకొయ్యలతో దిట్టముగా కట్టేవారు. ఒక్కొక్క ఆవరణమునకు నాలుగుద్వారములుండేవి. ద్వారములవద్ద పోలీసుకాపారీతో పాటు అంగళ్ల కంట్రాక్టరుల తాలూకు మనుష్యులుకూడా ఉండేవారు. వెలుపలి ఆవరణము లోనికిపోవుటకు అర్ధణాటిక్కట్టు; లోపలి ఆవరణమునకు పోవుటకు నాలుగణాల యివ్వవలయును. మొదట అర్ధణా యిచ్చి, లోపలికి పోతేగాని నాలుగణాల ఆవరణమునకు పోవుటకు వీలుకాదు.

అప్పటికి యింకను మద్రాసులో ఎలక్ట్రిక్ దీపాలు ఏర్పడలేదు. రాత్రి వెలుతురుకొరకు కిర్సనాయిల్ పోసిన తగరపుబుడ్లను, అంగళ్లలోను, బయటను తోరణములుగా కట్టేవారు. ఆ నూనెదీపములను వెలిగించుట 5 గం॥లకే ప్రారంభించినగాని, చీకటి పడునప్పటికి ముగియదు.

ఆకాలమున నేను మద్రాసులోనేయుండి చదువుకొనుచుంటిని. నాతల్లి నన్నుచూచిపోవుటకు మద్రాసు వచ్చినది. ఆమె వచ్చినపిమ్మట కొత్వాలుబజారు సమీపమున యుండు ఆచారప్పన్‌వీధి సందులోయున్న, ఒక యింటిలో ఒక రూమును నెల 1-కి. రు. పన్నెండణాలకు అద్దెకు తీసుకొని ఇరువురము నివసించుచుంటిమి.

అది 1886 అని జ్ఞాపకము. అప్పటికి రాణితోటలో డిశంబరు వేడుకలు ప్రారంభమై రెండుమూడు సం॥ లైనది. ఆ సం॥ను యథాప్రకారమవి సాగుచున్నవి. ఒకనాటిసాయంకాలము మాయింటిలో కాపురముండే పిల్లవాడును నేనునుకలిసి రాణితోటలోని వేడుకలుచూడ వెళ్లితిమి, నేను మాతల్లితో చెప్పియే వెళ్లితిని. మేమిరువురము సంతోషముతో ఇల్లువిడిచి నడుస్తూ సాయంకాలం 6 గంటలకు తోటకు చేరితిమి. పిమ్మట కొంతసేపు బయటనున్న రంగులరాట్నమును ఎక్కి గిరగిర తిరిగి ఆనందించితిమి. చుక్కాణిలో కాశీ రామేశ్వరములను చూచి సంతోషించితిమి. ఆవల నాతోవచ్చిన పిల్లవాడు లోనికిపోదాము అని నన్నుకూడ పిలిచినాడు. నావద్ద అర్ధణాలేదని చెప్పితిని. అయితే నాతోవచ్చిన బాలుని వద్ద అర్ధణామాత్రమే యుండెను. ఆతడు నాయందలి సావాసమున నన్ను విడిచిపోలేక, లోపలికిపోయెను. అప్పుడు

నావేతిలో అరుదమ్మిడీలు లేనికారణమున నేను దిగబడి ఉండవలసివచ్చెను. అర్ధణామాత్రమే చేతిలోఉన్న ధనవంతునిబిడ్డ మాత్రము లోపలికి వెళ్లగలిగి నాడు. నేను వెలుపలనే తిరుగుచుంటిని.

పిమ్మట కొంతసేపటికి లోపలి ఆవరణము నుండి పొగలెగయ నారంభించెను. మంటలుమండి వ్యాపించుచుండెను. ఆమంటతోగూడ వెదురుబొంగులు పెఠీల్, పెఠీల్, మని కాలి పగులుచున్న శబ్దము లోపలినుండి వినబడెను. లోపలికి పోయిన జనము బయటికి వచ్చుటకు ప్రయత్నించుచుండిరి గాని, పొగమంటవల్ల కండ్లుగానక దారితప్పి ఒకరిమీదఒకరు పడుటయు, కాళ్లక్రింద స్త్రీలుబిడ్డలుపడి చితికిపోవుటయు తటస్థించెను. ఆనాటి ప్రదర్శనమునకు గొప్పయింటివారు చాలమంది వచ్చియుండిరి. వచ్చిన పురుషులు వారి ఆలుబిడ్డలను వెతుకుచు ఒకరినొకరు గుర్తించలేక అగ్నిదేవున కందరు నర్పణమైరి.

అంతటి ఆనందమయమైన ప్రదేశమంతయు నొక్క అరగంటలోపల రుద్రభూమియైపోయినది. లోపలినుండి తప్పించుకొని రాగలిగినవారిలో కొందరికి గాయములు, కాల్పులు, గ్రుడ్డితనము ఏర్పడగా ఎట్లో వారు బయట పడిరి. కొందరు మంటలకు తాళజాలక సమీపములో నున్న కూవంనదిలో దూకిరి. వెలగల నగలు, ఇతర విలువైన పదార్థములు ప్రదర్శించినవారు సొమ్మును విడిచిరాలేక అంగళ్లలోనే కాలిపోయిరి. అట్టిసమయమున చోరీలుకూడా మెండుగా జరిగినవి. మరణించిన బిడ్డలమీదను స్త్రీల మీదను యుండే, వెండి బంగారపు నగలు; వస్త్రములందలి సరిగెలు కరిగి బంగారము, వెండి ముద్దలుగట్టి పోయినవి. ఆరోజులలో పురుషులును తగుమాత్రము నగలుధరించేవారు. ఆనాడు అమావాశ్య నాటి నీలి ఆకాశమువలె రుద్రభూమియైయున్న ఆ వినోదప్రదేశమున, ఆవెండి బంగారపు ముద్దలు నక్షత్రములవలె మిసమిస లాడుచు వెలుగ సాగినది.

ఇంతలో పోలీసువారు వచ్చి నిప్పునార్పు ఇంజన్లతో కాలిన కొరవులను ఆర్పివైచిరి. ఆరోజులలో చెన్నపట్నంలో చాలినన్ని నిప్పునార్పు యంత్రములు (ఫైర్ఇంజన్‌లు) లేవు కావున తెల్లవార్లు ఆమంటల నార్పవలసివచ్చినది.

ఆ రోజున నొక మహనీయుడొనర్చిన సేవ వర్ణనాతీతము. ఆయన క్రిస్టియన్ కాలేజి ప్రిన్సిపాల్ మిల్లరుదొర. ఆయన నేటివారి వంటివారు కారు; పూర్వపు కణ్వ, గౌతమకాణాది కులపతుల తలపించు కరుణార్ద్రహృదయుడు. ఆయన స్వయముగా, సాహసించి గుంజలెగబ్రాకి కాలుచున్న పందిళ్లను దులిపి

వేసినారు. పొగలోనున్న, శిశువులను స్త్రీలను ఇవతలికి తెచ్చివిడిచినారు. ఇంకెన్నివిధములుగానో అచ్చట బాధితులకు సహాయపడినారు. అంతేకాక కాలేజీకి వెళ్లి రిజస్టరు చేతబుచ్చుకొని పొరుగూళ్లనుండి విద్యాభ్యాసమునకైవచ్చి, కోనకొక్కడు, గొందికొక్కడుగా నుండిన వారిని పేరుపేరు వరుసన తెలుసుకొని వారి యోగక్షేమములను విచారించి వారితల్లిదండ్రులకు పోషకులకు తెలియ పరచి వారి ఆత్రము బాపిన శిష్యవత్సలుడగు మహాత్ముడతడు.

ఆ రుద్రభూమి నంతయు పోలీసులెంత కాపలా కాచినను, తెల్లవారేసరికి కరిగి ముద్దలైన వెండి, బంగారములు, వెదజల్లబడిన నవరత్నములు చాలవరకు ఆ నక్షత్రముల వలెనే మటుమాయమై పోయినవి.

ప్రదర్శనమున మంట ఎంత త్వరగా జ్వాలారూపమును దాల్చినదో, అంతత్వరగానే రాణితోట కాలిపోయినదన్నవార్త పట్నమంతా అల్లుకొనినది. మద్రాసులో ఆరోజు విశేష దినమగుటచే చాల యిండ్లలో నుండి వేడుకచూచుటకు వెళ్లి యుండిరి. ప్రదర్శనశాల భస్మమైన సంగతిని వినినతోడనే వారివారి బంధువుల క్షేమము తెలుసుకొనుటకు వేలకు వేలు జనము వెర్రిత్తినట్లు ఆక్రోశించుచు ఆ స్థలమునకు పరుగెత్తిరి. నల్లగా గాలి కొరివిదయ్యములవలె నున్న ఆ శవములను చూచుటకు ఆరాత్రి అధికారులు అవకాశ మివ్వరైతిరి. అందుచే వారి బంధువులందరును ఆరాత్రి అంతయు అక్కడనే యుండవలసి వచ్చినది. తెల్లవారిన పిమ్మట పోలీసువారు చచ్చిపడియుండిన వారిని గుర్తించుటకు వారి బంధువులకు అనుమతినిచ్చిరి. అయితే చచ్చినవారంతా నల్లగా బొగ్గు రూపమును దాల్చియుండుట వలన నిజమైన వారిని బంధువులు గుర్తించలేక పోయిరి. సగము కాలి వంటిన నగలున్న వారుకూడా కొందరుండిరి. అట్టివారిని 'మావారు' అని వీరు, 'మావారు' అని వారు తగాదాలను పెట్టుకొనిరి. కొందరిని మాత్రం బాగా గుర్తించగలిగిరు. చాల మంది గుర్తించనేలేకపోయిరి. ఆదినము రాత్రియింటికి రానివారంతా చచ్చినవారనే, తలంపబడి, వారివారి ఇండ్లల్లో కర్మకాండ జరిపింపబడినది. కొన్నియిండ్లనుండి కొందరు ఇంటిలో చెప్పకుండ అవసరపనులపై గ్రామములకు వెళ్లినవారున్నారు. అట్టివారికికూడా వారి ఇండ్లలో కర్మకాండ ముగిసిపోయినది. పిమ్మట ఆఊరికి పోయినవారు యింటికి తిరిగిరాగా, ఇంటివారును, వారును ఒకరినొకరు చూచుకొన్నప్పుడు వారివారి మనస్సు లెట్టుండెననేది పాఠకులే ఊహింపదగును.

## కొల్లా కన్నయ్యశెట్టి సాహసము

ప్రదర్శనములోనుండి బావు తప్పించుకొని ఇవతల పడిన వారును కలరు. అట్టివారిలో సుప్రసిద్ధపురుషులగు శ్రీకొల్లా కన్నయ్యశెట్టిగారొకరు. వీరు మంచి కసరతు చేసిన బలశాలులు. వీరు లోపలినుండి బైటికి తడికల ఆవరణముపైకి ఫల్టీకొట్టి వెలుపలికి దూకిన సాహసికులు, చతురులు. వారట్టు దూకుచుండగా వారి మెడలో నుండిన పెద్ద పొగడాల కంఠమాల జారి క్రిందపడిపోయినది. ఆదండ దొరికినవాడు మరునాడు శెట్టిగారింటికి వెళ్లి సమర్పించుకొని బహుమానమును పొందినాడు. ఆ కాలమున కొల్లా కన్నయ్య శెట్టిగారిని, వారి మెడలో యుండు పొగడాల మాలను తెలియని వారరుదు.

వీరు కోమట్లలో పెద్ద శెట్టి. వైశ్యులందరు వీరిని పూజించనిదే వారిండ్లలో శుభకార్యములను చేసుకొనేవారుకారు. ధనికుడు; దాత; గంభీర పురుషుడు. వీరు శ్రీకన్యకా పరమేశ్వరీ దేవాలయపు ధర్మకర్తలు. వారు అప్పుడప్పుడా దేవాలయమునకు వచ్చుచుండేవారు. వారప్పుడు మొగమునిండ విభూతి పూసుకొని దానిపైన యఱ్ఱటి కుంకుమబొట్టు పెట్టుకొని, జోడు గుఱ్ఱముల పీటన్ బండిలో కూర్చుండి జోడువింజామరలతో, ఇల్లు బయలుదేరి పరమేశ్వరి దర్శనార్థము దేవాలయమునకు వచ్చునప్పుడు వారికి జరుగుచుండిన గౌరవము, మర్యాద ఇప్పుడీప్రాంతమునకు వైస్రాయిగారు వచ్చినా, వారికిన్నీ జరుగజాలదు. శెట్టిగారు దేవాలయమునకు వచ్చెదరన్న సంగతిని జనులకొరకు తెలుపుటకు దేవాలయములోని పెద్దగంటను మ్రోగించేవారు. ఈ గంట శబ్దమును విన్న వారందరును ఆదర బాదరగా నడుములకు, పై పంచల కట్టుకొని, వీధి గుమ్మమున నిలువబడి శెట్టిగారు రాగానే దాసోహముల సమర్పించేవారు. వీరి ఆస్థిపాస్థుల పరిమితి చెప్పవలయునంటే —ప్రస్తుతము హైకోర్టు దానిచుట్టు ప్రక్కల వున్న బిల్డింగులుగల ప్రదేశమంతయు, నాడు వారి స్వంతము అని చెప్పిన చాలును.

## నా సంగతి

ఇక నాసంగతి ఏమైనదో చెప్పెదను. నేను ప్రదర్శనములు చూచుటకు లోనికి పోకుండ బయటనుండి ప్రాణముల కాపాడుకొంటిని; నాతో కూడ వచ్చిన బాలుడు కనబడకుండుటచే చాలాదూరము వెలుపల గేటువద్ద నిలుచుంటిని గాని వాడు కానరాడాయెను. అప్పుడు నేను వంటరిగా ఇంటివైపునకు

తిరిగి పోవుచుంటిని. నేను సెంట్రల్ స్టేషన్ ఎదుటికి వచ్చేసరికి నాపేరు పెట్టి పెద్దగా పిలుచుచూ ఆత్రముతో మాతల్లి పార్కువైపునకు పరుగెత్తు చుండెను. ఆమె గొంతును నేను గుర్తించితిని. వెంటనే పరుగెత్తిపోయి ఆమె ఎదుట నిలుబడితిని అప్పుడు మా అమ్మ నన్ను కౌగిలించుకొని నిట్టూర్పు విడిచెను. ఆమె ఈ ప్రదర్శనము కాలిపోయిన వార్త విన్న వెంటనే పరుగెత్తుతూ వచ్చి నన్ను కలుసుకొనుటచే, వళ్లంతయు జోరు చమటలు పోయుచు అలసటచే రొప్పుచుండెను. నేనామె అవస్థను చూచి, రోడ్డువార నామెను కూర్చుండమని చెప్పి, నేనునూ కూర్చుంటిని. ఆ కూర్చుండినచోటు సెంట్రల్‌స్టేషన్ గేటు ఎదురుగా జనరల్ హాస్పిటల్ ఆవరణపుగోడ ప్రక్కన. ఇప్పటికిని నేనాప్రక్కకు వెళ్లినప్పుడెల్ల పూర్వస్మృతితో ఆప్రదేశమును గమనించి చూచుచుందును. అక్కడ కొంత విశ్రాంతితీసుకొని ఒంటెద్దు బండిమీద యిరు వురము యింటికి చేరితిమి. అప్పుడు నాతో కూడవచ్చివాని తల్లి 'మావాడెక్కడ' యని అడిగెను. కాని నాకు వెంటనే నోట మాటరాక, కొంతసేపటికి జరిగిన సంగతి నంతయు తిన్నగా చెప్పితిని. వెంటనే ఆమె తనబిడ్డ కొరకు పార్కు నకు పరుగెత్తినది గాని, రాత్రియంతయు వెదియుండి పిల్లవానిని గానక, తెల్లవారిన పిదప నిరాశతో ఆతల్లి యిల్లుచేరినది. చెన్నపట్నమున ఆ దుర్దినం ఆవిధముగా గడిచిపోయినది.

## 3 ఇద్దరు తల్లుల చలవ

రాణీతోటలో ప్రదర్శనశాల తగులబడిపోయినపిమ్మట నాతల్లి నన్ను ఒంటరిగ మద్రాసులో విడిచిపెట్టిపోలేదు. మేమిరువురము మద్రాసులో యుండవలసివచ్చినది. నేను బడిలో చదువుకుంటూ యిద్దరు వర్తకుల పిల్ల కాయలకు బడిపాఠములను చెప్పుచుంటిని. వారు నాకు నెలకు చెరియొకరు రెండున్నర ఇచ్చేవారు. ఈ రు. 5 ల వరుంబడితో ఇద్దరము మద్రాసులో బ్రతుకుటకు కష్టమైనది. నాతల్లి ఒక కోమటి ఇంట్లో వంటచేయుట ప్రారం భించినది. అందుకు వారామెకు నెలకు రు. 5 లు ఇచ్చేవారు. ఈ విధముగా ఇరువురముకలిసి రు. 10 లు తెచ్చుకొనుచు కాలము గడుపుచుంటిమి. ఆ కాలమున రూపాయికి బియ్యం 6 పళ్లమొదలు 8 పళ్ల వరకు ఇచ్చుచుండిరి. సమీపమునయున్న రావిచెట్టు అగ్రహారమున భిక్షమెత్తుకొనే బ్రాహ్మణులు రూపాయకు 8 పళ్ల బియ్యమును అమ్మేవారు. మేము తరుచుగా వారి వద్దనే బియ్యం కొనేవారము. ఈ ప్రకారము కొంతకాలము జరిగినది.

(ఇంకా వుంది




## 1989 ఏప్రిల్ 10

పొట్టి శ్రీరాములు హాలులో ఫంక్షనయాక, ఇల్లిందల సరస్వతీ దేవిని డాక్టర్ కమల యింటి వద్ద దిగబెట్టి, ఆదరా బాదరా, మాకోసమని గంటన్నర నుంచీ వెయిట్ చేస్తున్న ఫ్రెండ్స్ ఇంటికి డిన్నర్‌కి! శ్యామలా సుబ్బారావు లిబియా వెళ్తోంది - ఏడాదికి గాని రాదు. అంచేత, రాధా శివస్వామి, - తొమ్మిది కాదు, పదైనా మీరు రావల్సిందే - అన్నారు. శ్యామల, రామేశం, రాధ, మేమిద్దరం - అంతే, అయిదుగురం! దగ్గిర దగ్గిర పన్నెండయింది - ఇల్లు చేరుకొనేసరికి!

## . . . . . 13

మద్రాసు నందమ్ బాక్మ్ లయన్స్ క్లబ్‌వారూ, 324 - A1 డిస్ట్రిక్ట్ ఛైయిర్మాన్ లయన్ కెవి గోవిందరావు జెడిపి హాలులో 'జాతీయ సమైక్యత' సెమినార్ ఏర్పాటు చేశారు. పాతికేళ్లుగా మైలాపూరులో ఉంటున్నప్పటికీ, చిత్రకూటం దగ్గిర యింత చక్కటి ఎయిర్ కండీషన్డ్ హాలు ఒకటి వున్నదనే విషయం తెలియదు. .... లయన్స్ క్లబ్ సమావేశాలకు ఒక ప్రత్యేక వరవడి, కొన్ని మర్యాదలూ ఉంటాయి. ఈనాటి సెమినార్‌కి అధ్యక్షులు సియస్ (మాజీ కేంద్ర మంత్రి సి॥ సుబ్రహ్మణ్యం).... "అనైక్యత వ్యక్తి నుంచి ఆరంభమవుతుంది. 'బాబూ, నీ పక్క బెంచీలో అబ్బాయి పెన్సిల్ అడిగితే యివ్వకు అని చెబుతుంది తల్లి. అంతేగాని 'పెన్సిల్ యిచ్చినా, అడిగి పుచ్చుకోవడం మర్చిపోకు' - అని అనదు. ముఖ్యంగా పెద్దవాళ్లలో మార్పు రావాలి. శ్రీ అరవిందులు చెప్పిన నైతిక విలువల పునరుద్ధరణ జరగాలి .... సంఘంలో కనిపించే అనైక్యతకు బీజం గృహసీమలో ఉంది. ప్రతిమనిషీ ఉన్నతంగా బతికేందుకు ప్రయత్నించినప్పుడు, విస్తృతమయేది జీవచైతన్యమనీ, కుంచించుకుపోయేది జీవ రాహిత్యమనీ తెలుసుకోగలిగినప్పుడు, సమరస భావం వైపుగా పయనించినప్పుడు, వ్యక్తిలో ఏర్పడే సమైక్యతా లక్షణమే దేశ సమైక్యతకు దోహదకారి అవుతుంది' - అన్నారు యన్సి కృష్ణన్ ....

''మనది వసుధైక కుటుంబ లక్ష్యం. ఐదు వేల సంవత్సరాల సంస్కృతీ ప్రవంతి ఈ భరత భూమిని పునీతంచేస్తోంది. కాలావసరాలని బట్టి సాధువులు, సంగీతజ్ఞులు, కవి పండితులు, భక్తితత్పరులు ఈ దేశ సమైక్యతని కీర్తిస్తూనే ఉన్నారు. సాంఘిక రాజకీయ కల్లోలాలకి అతీతమైన సంస్కృతీ వాహిని మన సమైక్యతని కాపాడుతోంది - కాపాడుతుంది'' - అన్నారు ప్రొఫెసర్ ప్రేమ .... ''మనకు ఆర్య నాగరికత, ద్రవిడ నాగరికత అంటూ లేదు. మొత్తం భారతీయ నాగరికత అంతా ఒకటే. గాంధారానికి చెందినంత మాత్రాన గాంధార శిల్పం భారతీయులదికాదా ? పర్సియన్ ప్రభావం వున్నంత మాత్రాన తాజ్ మహల్ భారతీయ శిల్పం కాదా? భాషలూ, ప్రాంతాలూ గాక భారతీయత నెలకొనాలి. మన దృక్పథం మారాలి - సమదృష్టి, సమభావన పెరగాలి, సమదర్మన అలవరుచుకోవడం ద్వారా దేశ సమైక్యతను ప్రోది చేయుగలుగుతాం'' - అన్నారు మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి శివ సుబ్రహ్మణ్యం .... ''మన రాజ్యాంగ శాసనం భారతీయులందరినీ ఏకతాటి మీద నడిపిస్తోంది. భారతీయుడైన ప్రతి పౌరునికీ ఒకే మాదిరి సదుపాయాలు వున్నాయి - కులం, మతం, భాష, స్త్రీ పురుష వ్యత్యాసం - యిలాటివాటి ప్రసక్తి లేదక్కడ. రాజ్యాంగ శాసన సూత్రాలను శిరోధార్యంగా భావించి నప్పుడు, అల్పత్వాలకు ఆస్కారం లేదు. గాంధీగారు చెప్పిన సమస్తం మనం గాలికి వొదిలేస్తున్నాం. అదే మన కష్టనష్టాలకు కారణ భూతమవుతున్నది. ఇవ్వాళ గాక పోతే రేపయినా, సమస్త మానవాళి గాంధేయ మార్గాన్ని అవలంబించక తప్పదు. ప్రపంచంలోని విజ్ఞులందరూ ఈ విషయం వొప్పుకుంటున్నారు. భారతీయుల మైన మనమే గాంధీ తత్వం తెలుసుకోలేక ఎండ మావుల వెంట పరుగు తీస్తున్నాం. గాంధేయ పథ మొక్కటే ఈ దేశ సమైక్యతను దృఢ పరచ గలుగుతుంది'' - అన్నారు అధ్యక్షత వహించిన సి సుబ్రహ్మణ్యం. మొత్తం పాతిక మందే అయినప్పటికీ ప్రతి ఒక్కరి లోను సంచలనం కలిగించే ప్రసంగాలు.

..... 14

ఇవ్వాళ తమిళ ఉగాది, ''ఈ సారి మా ఇంట్లో - మీరు ముగ్గురూ లంచ్‌కి వస్తున్నారు'' - అని చెప్పారు రెండు రోజుల క్రితం హేమా రామేశం .... భగవద్గీత శ్లోకాలు కోట్ చేస్తూ దేశదేశాల కబుర్లు చెప్పే రామేశంతో ఎంతసేపు మాట్లాడినా సరదాగానే ఉంటుంది. ఈ మైలాపూర్‌లోని తన చిన్ననాటి గుర్తులెన్నో చెబుతారాయన .... హెన్రీ కిస్సింజర్ ఆఫ్టర్‌డిన్నర్ స్పీచ్‌కి (ఇరవై నిముషాలు - ప్రశ్నోత్త

రాలతో కలపి) రెండు వేల డాలర్లు పుచ్చుకొనేవాడట .... బ్రిటిష్ ప్రధాని చర్చిల్ 1955 లో అమెరికా వచ్చినప్పుడు, ఆయనని ఏర్‌పోర్ట్‌లో రిసీవ్ చేసుకు, వైట్‌హవుజ్‌కి తీసుకు వెళ్లవలసిన బాధ్యత వైస్ ప్రెసిడెంట్ రిచర్డ్ నిక్సన్‌పై పడిందట. చర్చిల్‌కి విమానాశ్రయంలో చెప్పవలసిన స్వాగతోపన్యాసం తొంభయి సెకనులు - అంటే ఒకటిన్నర నిముషాలు. ఆ ఒకటిన్నర నిముషాల స్పీచ్, నిక్సన్ ఒక రోజంతా శ్రమపడి తయారు చేశాడట. చర్చిల్ విమానం దిగాడు - అయన గారి దృష్టి ఎంతకీ టివి కెమెరాల మీద, పత్రికా విలేఖరుల మీద! ఇంత కష్టపడి నిక్సన్ తయారు చేసుకొన్న ఒకటిన్నర నిముషాల స్పీచ్ చెప్పే అవకాశమే లేకుండా అందరూ కార్లు ఎక్కవలసి వచ్చింది .... రెండు గంటలకి లంచ్ అయాక, "కాఫీ తాగకుండా ఎలా వెళ్లనిస్తాను?" అన్నారు హేమ. ఆ కాఫీలై యిల్లు చేరుకొనేసరికి మూడున్నర. జోసఫ్‌ని (డ్రయివర్) యింటికి పంపేశాము .... 'రైట్స్' వికె మోహన్, తనే తన 'మారుతి' లో వచ్చి, మాకు పండగ డిన్నర్ యిచ్చి కాసేపు వాళ్ల డాబా మీద కబుర్లయాక మమ్మల్ని యింటి దగ్గిర దిగబెడతామన్నారు. లేట్ లంచ్‌తో కొంచెం అలసటగా వున్నా, యింత ప్రేమగా ఆప్యాయంగా పిలుస్తున్నప్పుడు, కాదనగలమా? 'నీవు కీర్తి కాముడివి' అంటుంది మాలతి జోక్ చేస్తూ! కీర్తి కాముకత్వం కాదు - సజ్జన సాంగత్యం అరుదవుతున్న రోజులలో, సజ్జనులని ఎలా వొదులుకోగలం? ఈ స్నేహ సుగంధమే కదా జీవితానికి వెలుగునీ, విలువనీ ఇచ్చేది! .... మిసెస్ మోహన్ (వాణి) ప్రూటీతో ప్రారంభించి, భోజనాల దగ్గిర తైరు వడలతో సహా తరిమి తరిమి వడ్డించి, కారెట్ పాయసంతో ముగించి, కర్పూర పరిమళం కిళ్లీలు యిచ్చారు. పదకొండున్నర అయాక 'ఇక పోదామా?' అన్నాం .... న్యూ ఆవడి రోడ్ నుంచి కచేరీరోడ్ అంటే పది పన్నెండు కిలోమీటర్లు. ఇంకో అయిదు నిముషాలకి తేదీ మారుతుందనగా ఇల్లు చేరుకున్నాం.

. . . . . 20

వెంపటి చినసత్యం కూచిపూడి ఆర్ట్ అకాడమీవారికి విదేశ పర్యటనలు సర్వసామాన్యమై పోయాయి. జకొస్లొవేకియా, హంగెరి మున్నగు తూర్పు యూరప్ దేశాలకు, ఫ్రాన్సుకు రేపు వుదయం బయలుదేరి వెళ్తున్నారు. నాట్య ప్రపంచంలో 'కూచిపూడి' కి ఒక విశిష్ట స్థానం కలిగించారు చినసత్యం. భరతనాట్యంతో బాటు యిన్నాళ్లూ కథాకళి, ఒడెస్సీ - మణిపురి మాత్రమే చెప్పేవారు, ఇప్పుడు కూచిపూడి చెప్పక తప్పడం లేదు. ఈ సాంస్కృతిక ప్రతినిధులు తమ విదేశయాత్ర జయప్రదంగా ముగించుకు రావాలని కోరుతున్నాము.

. . . . . 23

మాయింట్లో ప్రతిమూలా, ప్రతి చోటా శర్మగారిని గుర్తుచేసే వస్తువులే! టేబుల్ మీదున్న అల్ఫబెటికల్ ఫైల్, పెన్నులూ పెన్సిళ్లూ పెట్టుకొనే స్టాండు, డేట్ పాడ్, స్టీల్ రాక్, స్టేనషరీ బీరువా, డిక్షనరీలు, రిఫరెన్స్ బుక్కులూ, టేప్స్ సోఫాపక్కనుండే బల్లలు, కేన్ కుర్చీలు, నేను వాడేటేబులు - ఇదీ అదీ అనేమిటి, శర్మగారు మాయింట్లో మా మధ్య, మా మనసుల్లో సజీవంగా ఉన్నారు. ఇహలోక యాత్ర చాలించి మూడేళ్లయినప్పటికీ (1986 ఏప్రిల్ 23 సాయంత్రం నాలుగున్నరకి భక్తిగీతం ఆలకిస్తూ దీర్ఘనిద్రలోకి జారుకున్నా), ఆయన మా మధ్య మాలో ఒకరై ఉన్నారు. శర్మాదంప తులు ఆదర్శప్రాయంగా నిర్మించిన ఛిల్డ్రన్స్ గార్డెన్ స్కూలులో ఈ ఉద యం, దైవనామ సంకీర్తనతో, భజన తో ఆయన సంస్మరణ జరిగింది.... దినయామి న్యౌ సాయం ప్రాతః - శిశిర వసంతౌ పునరాయాతః - కాల క్రీడతి గచ్ఛ త్యాయు :'

. . . . . 24

లియొ కాసెట్స్ వారు (ఎగ్జిక్యూ టివ్ డైరక్టరు : ఆనంద్) ఈ సాయంత్రం సవేరాలాన్స్‌లో, 'ప్రియా - ఓప్రియా' రిలీజ్ ఫంక్షన్ ఏర్పాటు చేశారు. ఆహ్వాన పత్రికలో పేర్కొన్న దాసరి నారాయణరావు, కెకె రామ స్వామి యిరువురూ ఎందువల్లనో రాలేదు. అయిదున్నరకి అనుకున్న ఫంక్షన్, ఇంచుమించు ఏడు గంటల దాకా ప్రారంభం కాలేదు. ఈ ప్రేమ గీతాలు రచించిన వెన్నెల కంటి, కార్య క్రమాన్ని నిర్వహించగా, 'ప్రేమికుల కానుక' గా పేర్కొన్న ఈ కాసెట్‌ని హీరో చిరంజీవి రిలీజ్ చేశారు. పాడిన వారు : యస్పి బాలసుబ్రహ్మణ్యం, సరళరేఖ. స్వరకల్పన : వాసూరావు. మ్యూజిక్ డైరక్టర్ ఒపి నయార్, వేదిక మీద ఆశీనులైనవారిలో ఉన్నారు : మొత్తం ఎనిమిది పాటలు వున్నాయి : 1 రాణీ - రాణీ ; 2 ప్రియతమా ; 3 మల్లికవో - మధురిమవో ; 4 సరస మాడ వచ్చాడె ; 5 లవ్ మి స్వీట్ బ్యూటీ ; 6 కలగా మిగిలి పోయే ; 7 నిదురించు హృదయదీపం ; 8 పొద్దు వాలనీ డోయమ్మ. మూడు, ఆరు, ఏడు సంఖ్యలగలవి కవనంలోను, గానంలోను ప్రత్యేకత కలిగివున్నాయి.

1989 మే 03

లలితశ్రీ కంబైన్స్ వారి 'సీరా జనం' కాసెట్ రిలీజ్ పంక్షన్ సవేరా కాన్ఫరెన్స్ హాలులో. 'అభినందన' చిత్రంతో విజయం సాధించిన రమణ మూర్తి ఈ చిత్రానికి నిర్మాత. ఊటీ, కొడైకెనాల్, కాశ్మీర్, మర్కెరా, మద్రాసులలో షూటింగ్ జరిగింది: విశ్వాస్ అనే బెంగాలీ యువకుడు, శరణ్య అనే మళయాళం అమ్మాయి యిందులో హీరో హీరోయినులు, సోమ యాజులు, రాజ్యలక్ష్మి, శరత్‌బాబు, కుయిలి మున్నగు వారున్నారు. నారాయణరెడ్డి, ఆత్రేయ, వెన్నెల కంటె ఈ పిక్చర్‌కి పాటలు రాశారు.

సంగీత ప్రధానమైన ఈ పిక్చర్‌లో యమ్మెస్ రామారావు 'ఈ విశాల ప్రశాంత....' కూడా ఉంది. ఒపి నయ్యార్ జనాకర్షణీయమగు మ్యూజిక్ సమకూర్చారు: కాసెట్‌లోని ప్రతి పాటా మళ్లీమళ్లీ వినాలనిపించేటంత సాహిత్య మధురిమతో సుశ్రావ్యంగా ఉంది. "పదకొండో తేదీన రిలీజ్ చేదామనుకుంటున్నాను - మీ అందరికీ చూపించకుండా రిలీజ్ చేస్తానా?" అన్నారు నిర్మాత ఆర్వీ రమణమూర్తి. దర్శకత్వం : అశోక్‌కుమార్.

. . . . . 12

వైయస్ శాస్త్రి దంపతుల మూడో అబ్బాయి చి॥ శ్రీ ప్రకాష్‌కు, గుంటూరుజిల్లా కొలనుకొండ వాస్తవ్యులు దోర్బల వెంకటరామ నరసింహ శాస్త్రిగారి పెద్దమ్మాయి సౌ॥ లక్ష్మికి, ఈ నెల ఎనిమిదోతేది ఉదయం 10 గం॥ 43 ని॥లకు విజయవాడ మధు కళామండపంలో వివాహం జరిగింది; ఈ సాయింత్రం నల్వాజ్వ కళ్యాణమండపంలో రిసెప్షన్. వైయస్ శాస్త్రిగారు (పొట్టిశ్రీరాములు సంస్థ సెక్రటరీ) మద్రాసులోని తెలుగువారికి చిరపరిచితులు. బంధుమిత్రులనేకులు నవ దంపతులకు శుభాభినందనలు తెలిపారు.

. . . . . 15

పియస్ రామ్మూర్తి లలితా రామ్మూర్తి దంపతుల కుమార్తె సౌ॥ మీరాకు, శివశంకరమ్ దంపతుల కుమారుడు చి॥ నారాయణన్‌కు ఈ

## ముఖచిత్రం



1925 - 1947 మధ్య కాలంలో ఏడంటే ఏడు చిత్రాలు (కిడ్, గోల్డ్ రష్, సర్కస్, సిటీలైట్స్, మోడరన్ టైమ్స్, గ్రేట్ డిక్టేటర్, మాన్‌జు వెర్దు) మాత్రమే నిర్మించి, ప్రపంచ దృష్టి నాకట్టుకొన్న అద్వితీయ కళాకారుడు చార్లీ చాప్లిన్ .... .... లేతవయసులోని క్షుద్బాధ, గాయకురాలైన తల్లితో చిన్నవయసులోనే రంగస్థలమెక్కి పాడుతూ, ప్రేక్షకులు విసిరిన డబ్బులు ఏరుకోవడమాయాక పాటమళ్లీ మొదలు పెడతాననే నిర్భీతి - ఈ రెండూ చాప్లిన్‌ని దేశదిమ్మరి పాత్రలో (ట్రాంప్) ప్రపంచ ప్రజానీకాన్ని కరుణార్ద్ర భరితమైన నవ్వు పువ్వులలో ముంచెత్తే కామెడీకింగ్‌గా చేశాయి. సామాన్యుని హృదంత రాళంలోని వేదనకు ప్రతీకగా నిలిచాడు చార్లీ చాప్లిన్. 1918 నాటికే డగ్లస్ ఫెయిర్ బాంక్స్, మేరీ పిక్ ఫర్డ్‌లతో కలసి హాలీవుడ్‌లో స్టుడియో స్థాపించి అత్యధిక ధనవంతు డయాడు .... ఇరవై ఏళ్లపాటు (1952 - 72) స్విట్జర్లాండ్‌లో ఉండి పోవలసి వచ్చింది. 1975లో ఈ మహాపురుషుని బ్రిటిష్‌రాణి సర్ ఛార్లెస్ స్పెన్సర్ చాప్లిన్‌గా నైట్‌హుడ్‌తో గౌరవించింది. - 1977లో పరమపదించిన చార్లీ చాప్లిన్ శతజయంతి సంవత్సరం.

ఉదయం పది గంటలకు ధర్మప్రకాష్ కళ్యాణ మండపంలో వేదోక్తంగా వివాహం జరిగింది. నూతన వధూవరులకు మా శుభాకాంక్షలు.

. . . . . 18

'తమిళనాడు బౌద్ధం' (Buddhism in Tamil Nadu--A New Perspective) అనేగ్రంధాన్ని మాజీకర్ణాటక విద్యామంత్రి జీవరాజ్ అల్వా, 'ది డేట్ లెస్ మ్యూజ్ అండ్‌ది జర్నల్ఆఫ్ ది ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఏషియన్ స్టడీస్ (The Dateless Muse and the Journal of the Institute of Asian Studies) అన్నా యూనివర్సిటీ వైస్ - ఛాన్సలర్ కొళందైస్వామి, భారతీయ విద్యాభవన్‌లో జస్టిస్ కృష్ణయ్యర్ అధ్యక్షతను రిలీజ్‌చేశారు. ఈ గ్రంధాల అవిష్కరణతోబాటు తమిళనాడు విద్యామంత్రి అంబజగన్, పి హెచ్‌డి కోర్సుకీ, ఆంధ్ర విద్యామంత్రి సీతాదేవి డిపార్ట్‌మెంట్ ఆఫ్ తెలుగు స్టడీస్‌కి ప్రారంభోత్సవం గావించారు. కాకతీయులకాలం నాటి తెలుగుజాతి తెలుగుభాష సాహిత్యంలో, శిల్పంలో లలిత కళలలో తెలుగువారి ఔన్నత్యం భారతీయ సంస్కృతిలో తెలుగువారి స్థానం-యిత్యాది విషయాలు ప్రస్తావించారు ఆంధ్రవిద్యామంత్రి సీతాదేవి

. . . . . 21

రత్నకుమారి చెల్వపిళ్ల దంపతుల కుమార్తె సౌ॥ పద్మకు, రాజమండ్రి వాస్తవ్యులైన జి కృష్ణమూర్తి దంపతుల కుమారుడు డా॥ ప్రసాద్‌కి ఈ ఉదయం 9 గం॥ 45 ని॥లకు వుడ్‌లాండ్స్‌లో శాస్త్రోక్తంగా వివాహం జరిగింది, బంధుమిత్రు లనేకులు స్వయంగావచ్చి, నూతన వధూవరులను ఆశీర్వదించారు .... కార్డియాలజిస్ట్‌గా పేరు ప్రఖ్యాతులుగల డా॥ చెల్వపిళ్ల, స్టేట్స్‌నుంచి వచ్చి, కొన్నాళ్లపాటు అపొల్లోవుండి, మళ్లీ స్టేట్స్ వెళ్లారు ప్రస్తుతం అయన అమెరికాలోనే ఉంటున్నారు - ఫామిలీ మాత్రం మద్రాసులో! సహృదయులూ, స్నేహపాత్రులు అయిన డా॥ చెల్వపిళ్ల (సొంతవూరు నెల్లూరు) వంటివారు నూటికీ కోటికీ ఒకరుంటారు .... పోయిన సంవత్సరం కాకినాడ వెళ్లినప్పుడు కలుసుకో లేకపోయిన మూతా గోపాలకృష్ణ గారిని, ఈ ఉదయం వుడ్‌లాండ్స్‌లో కలుసుకున్నాం. 'పెళ్లిభోజనమయాక మా యింటికిరండి, కాసేపు కూచుందాం' - అన్నాము. మా మాట కాదనకుండా, మాయింటికి వచ్చి ఒకగంటసేపు మాతో గడిపారు గోపాలకృష్ణ దంపతులూ, వారి సోదరుడూ పిల్లలూను. కాకినాడ లేడీస్‌క్లబ్ తల పెట్టిన ఇన్‌డోర్ స్టేడియమ్ పూర్తి కానున్నదని లక్ష్మిగారు చెప్పేసరికి, ఆనందించాము.

—యన్నార్ చందూర్

సీరియల్

# మజిలి

## అన్నపూర్ణా రెడ్డి

గడిచిన కథ : కళా హృదయిని జ్యోత్స్న, తన యిద్దరు పిల్లల్ని భర్త వద్ద వొదిలి వెళ్లిపోయింది : బాధ్యత గల తండ్రిగా ఆ పిల్లల్ని పెంచుతున్నాడు డాక్టరు సారథి. ఆపదలో వున్న జానకికి ఆశ్రయమిచ్చాడు - హవుస్ కీపరుగా ఈ పిల్లల ఆలనా పాలనా చూస్తోంది. చుట్టం చూపుగా ఒకసారి వచ్చి వెళ్లింది జ్యోత్స్న .... ఇక చదవండి.

తలెత్తి ముఖం వంక చూసింది; "ఆ ! మీరా" అంటూ హడావుడిగా లేవబోయింది జానకి .... "అంతలా ఆలోచిస్తున్నావు ? నిన్ను బాహ్యస్మృతి, పరినిరాల స్మృతి కూడా లేనంతగా ఆ కట్టుకొని ఎచటికో పట్టుకుపోయిన ఆ ఆలోచన లెంత గొప్పవో ? నాదగ్గర 'మూవీ కెమెరా' లేదుకానీ, ఓస్ ఇందాకటినుంచి, ఆ ముఖంలో ఎన్నెన్నో భావాలు.... ఆ కంటి పాపల్లో ఎన్ని కదలికలు ?" - సారథి పెదిమెలపై ఎప్పుడూ లేని కొంటెనవ్వు....

గబుక్కున లేచి మౌనంగా లోనికి తప్పుకుంది.

పెరట్లో వేణీళ్లు తొలిపి, తుండు దండెం మీద వేసి వంటఇంటిలోకి వెళ్ళిపోయింది.

కంచం పెట్టి గ్లాసులో నీళ్ల పోస్తూ "ఛీ .... ఛీ .... ఈదినం ఏమొచ్చిందీ బుర్రకు ! డాక్టరుగారు ఏమనుకొన్నారో ? .... పరధ్యానాన్ని పొరపాటుగా అర్థం చేసుకోరు కదా ?" మనసులోనే లెంపలేసుకుంది.

డాక్టరు తిరిగీ రెట్టించి అడిగితే నిజానికి తన దగ్గిర ఏలాటి సమాధానం కూడా లేదు .... అయినా .... ప్రేమ - వాటి తాలుకు మోహాన్ని గురించి ఆలోచిస్తున్నావంటే ? బాబోయ్ .... ఇంకేమైనా వుందా ? ఆలోచనలు వదల్చుకోవడాని కన్నట్టు బుర్రను గట్టిగా విదల్చి కంచంలో అన్నం, కూరలు వడ్డించింది.

సారథి కంచం దగ్గిర కూర్చుంటూ "పిల్లలు నిద్రపోయారా" అని రోజూ అడిగే ప్రశ్నేతప్పా ఇతర మేమీ అడగలేదు.

తింటున్నవాడల్లా తలెత్తి జానకి వంక చూసి "నీవింకా భోంచేయలేదు కదూ ?" .... అని అడిగాడు. తలాడించింది జానకి.

"చూడు.... తొమ్మిది దాటింది.... లాభం లేదు, జానకీ .... సమయానికి ఇంత దాణా కడుపుకు పడేసుకోవడం

అలవాటు చేసుకొమ్మని లోగడ ఎన్నో సార్లు చెప్పాను .... అయినా నీమొండి పట్టు విడవవు ....''

కూర కలుపుకొంటూ చిన్న లెక్చ రిచ్చిన సారథిని చూస్తూ !

''పని మీద తిరిగే మీకు లేని ఆకలి - ఇంటి పట్టున వున్న నాకు ఎక్కడిది ?'' అంది ....

''ఏమైనా అంటే ఆమాట అనేస్తావు .... సరే .... నీతో ఓ ముఖ్యవిషయం చెప్పాలి .... జానకీ ....'' మంచి నీళ్ల త్రాగి గ్లాసు ప్రక్క నుంచాడు సారథి. గాయత్రిగానీ, మళ్లీ జ్యోత్స్నదేవి గానీ రారుకదా అన్పించింది. కళ్ళల్లో ఓవిధమైన భయం తారట్లాడింది. అయినా మౌనంగా వుండిపోయింది.

''ఈ రాత్రికి .... నీవు .... ఓ సాయం చేయాలి ....''

ఏమిటన్నట్టు కళ్ళెత్తి చూసింది ....

''ఓ పేషెంటుకు నర్స్ పని చేయాలి'' - చిన్నగా నవ్వాడు సారథి ....

''నేనా .... నాకేం ... వద్దు ?''... భయంగా అంది.

''భయపడకు .... నేచెప్పేది విను. మాకేమో ఫేమిలీ ప్లానింగ్ వీక్ అని పెట్టారు.... ఒక్కో పి.హెచ్.సి లోనా ఇన్ని ఫేమిలీ ప్లానింగ్ ఆపరేష నులు చేయాలి అని ఒక టార్గెట్ నిర్ణ యించారు. అవన్నీ పూర్తిచేయాల్సిందే నన్నమాట.... ఇప్పుడు పి.హెచ్.సి నిండా ఆ కేసులే వున్నాయి. ఆఖరుకు డాక్టర్ కన్సల్టింగ్ రూములో కూడా వాళ్లే! అదిచాలక ప్రక్క కొన్ని తాత్కా లిక షెడ్డులూ అవీ వేశారు పని ముమ్మరంగా వుంది....'' చెప్పడం ఆపి జానకి వంక చూచాడు.

జానకి కళ్ళల్లో భయం సుస్పష్ట మౌతోంది.

అది చూచి సుతారంగా నవ్వి ''నర్సు, హెల్త్ విజిటర్సు, .... ఆయా .... అందరూ రేయింబవళ్లు అక్కడే వోవర్‌టైమ్ చేస్తున్నారు. అది చాల దన్నట్టు ఇందాక ఓ దెబ్బలు తగిలి స్పృహ కోల్పోయిన వ్యక్తి ఒకతణ్ణి హాస్పటలోకి తీసుకొచ్చారు.''

చేతులు రెండూ ఎదమీద పెట్టుకు భయంగా నొక్కుకుంది జానకి.

''అతణ్ణి అక్కడ వుంచడానికి చోటులేదు''

మౌనం

''అతన్ని ఈవేళ, రేపు మన ఇంటి లో వుంచుదామనుకొంటున్నాను ...''

''మన ఇంటిలోనా.... ఇక్కడా .... ఊహూ ....'' అప్రయత్నంగా తన అయిష్టాన్ని వ్యక్తం చేసింది. వెంటనే తన తప్పు గుర్తించి పెదవి కొరుక్కొని .... తనకేం హక్కుందని ఈ యింటిమీద.... అలా అడ్డం చెప్పేసింది .... చెప్పిన పని చేయడమే తన బాధ్యత .... తన్నుతానే మంద లించుకొని .... ''అలాగే'' అంది ....

నీ భయం నా కర్థమైందిలే అన్నట్టు జానకిని చూచి ''వారం రోజులవరకూ పి.హెచ్.సిలో మాకు ఈ శిబిరం నడుస్తుంది. ఈ రాత్రికి కాస్త అతణ్ణి నీవు కనిపెట్టుకొనివుండాలి. నేను వచ్చే వరకూ హాస్పిటల్ సిబ్బందిలో ఎవరో

?

"Hiding behind a tree, your great Rama assassinated Vali. A man, who had earlier killed fourteen thousand demons single-handed, could have easily finished off Vali. Why in such a sneaking manner ?" asked Raghu.

"Vali himself threw a bundle of accusations maligning the character of Rama - against the backdrop of Ishwaku tradition," said Raghu's Father.

"Rama always had a clever and cunning reply..."

"Not so. It was a reply loaded with Dharma. The Ishwaku throne was in the custody of Bharata and Rama, though roaming the forests had to uphold the Ishwaku tradition. After all Vali was a vassal to the Ishwaku kings and as the King's (Bharata's) Representative (Rama), he had to punish the vassal for the misconduct of stealing the brother's wife. At the dying moment Vali, of course, boasted of fetching Ravana to the feet Rama and make him surrender Sita. 'That is my job - there also I have to punish the wrongdoer' said Rama. According to Rama, Vali should pay for his follies and no king would fight his subordinate on equal terms - he would simply punish him and be done with that."

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*

ఒకరు వచ్చి పేషెంట్ కండిషన్ అదీ చూచి వెళ్తుంటారు''

భోజనం ముగించి లేచి చేయికడుక్కున్నాడు సారథి. జానకి అందించిన టవలుతో చేయి తుడుచుకొంటూ ''జానకీ! కాస్సేపు నేనిక్కడే వుంటాను. అలోగా భోంచేయి'' అన్నాడు.

పేపరు ముందేసు కూర్చున్నాడు సారథి.

జానకి గబాగబా నాలుగు ముద్దలు తిని వంటిల్లు సర్ది ఇవతలకు వచ్చింది.

వసారాను అనుకొని వున్నగదిలో ఓ మంచం వాల్చి, దుప్పట్లు పరిచింది. మనసులో ఈ డాక్టరు వెర్రిగానీ, వాడెవడో అదృష్టవంతుడు! .... స్పృహ కోల్పోతోనేం ఏకంగా డాక్టరు గారింటిలోనే మకాం వేస్తున్నాడు - అనుకుంది.

ఓసారి గదిలోకి తొంగిచూచి ''నీ సంరక్షణలో అవతల వ్యక్తికి తెల్లవారేసరికి నయం అయిపోతుంది'' అంటూ ప్రశంసా పూర్వకంగా చూచాడు.

ఇంటిముందు అలికిడి అయితే తొంగిచూచింది జానకి. ఇద్దరు మగాళ్లు స్ట్రెచ్చరు మోసుకొస్తున్నారు. తెల్ల దుప్పటి మెడదాకా కప్పివున్న వ్యక్తి పడుకొని వున్నాడు.

వారికూడా హెల్త్ విజిటర్ నడిచి వచ్చింది.

''ఏమ్మా ఇంతాలస్యం?''- పలుకరించాడు సారథి.

''సలైన్ ఇవ్వడం ఇప్పుడే పూర్తయింది, సార్''.

''సరే! లోపల మంచం మీద పడుకోపెట్టు, రహీమ్.''

పేషంట్‌ను పడుకోబెట్టి మగవాళ్ళిద్దరూ స్ట్రెచ్చర్ పుచ్చుకొనివెళ్ళిపోయారు.

''చూడండి, విమలా .... నేను హాస్పిటల్‌కి వెళ్తున్నాను.... మీరు మా జానకికి తోడు ఇక్కడే కాస్సేపు వుండి రండి. తను భయపడిపోతోంది'' .... అంటూ రోగిని స్టెత్‌తో మరో మారు పరీక్షించి ''గుడ్ - ప్రాణభయం లేదు. కొన్నిగంటల్లో స్పృహ రావచ్చు.... స్పృహ వచ్చాక త్రాగుతానంటే వేడి కాఫీ ఇవ్వు, జానకీ.... కంగారు వద్దు. విమల ఇక్కడే వుంటారు. ఏదైనా అవసరం వుంటే పి.హెచ్.సి.కి కబురు చేయి విమలా! .... వస్తాను ....'' అంటూ టార్చిలైటు తీసుకొని చీకట్లో కలిసిపోయాడు సారథి.

''కూర్చోండి''- కుర్చీ చూపించింది జానకి.

జానకి చదువుతూ వదిలేసిన పత్రిక చేతిలోకి తీసుకుంది విమల.

కళ్ళలో భయాన్ని దాచుకొంటూ అచేతనంగా పడివున్న పేషంటుకేసి ఓమారు చూచి పిల్లల గదిలోకి వెళ్ళింది జానకి. తన గుండెల్లో రేగిన గుబులు ఉపశమించాలంటే అంతకంటే వేరే మార్గం అవుపించలేదు.

పిల్లలిద్దరూ ప్రశాంతంగా నిద్రిస్తున్నారు. చెదరిపోయిన దుప్పట్లు సరిచేసింది. దిళ్లు సరిచేసింది. కాస్సేపు విజ్జి ప్రక్కలో, విజ్జిని అనుకొని కూర్చొని ముంగురులు సవరించింది.

(ఇంకా వుంది